# రమణ భాషణములు ఏడవ సంపుటం

## భాషణములు 601

శ్రీ గుర్రంసుబ్బరామయ్య కాలం గూర్చి ప్రస్తావించారు. మహర్షి: కాలమేమి? అది ఒక స్థితిని, దాన్ని గుర్తించడాన్ని, దాన్ని బాధించే మార్పులను ప్రతిపాదిస్తుంది. రెండు స్థితుల అంతరాన్ని కాలమన్నారు. మనస్సు దానిని తీసుకురాకపోతే ఏ స్థితిగూడ సంభవించదు. మనస్సు ఆత్మ వశంలో ఉండాలి. మనస్సు నుపయోగించకుంటే కాలభావనే లేదు. కాలదేశములు రెండూ మనస్సులోనివే. కాని వ్యక్తి యథార్థస్థితి మనస్సున కతీతమైనది. సహజస్థితిలో సుస్థిరునికి కాలమన్న మాటేలేదు.

నారాయణయ్యర్: శ్రీ భగవాన్ మాటలు సురుచిరమేగాని సులువుగా మా కర్థమయ్యేవి కావు. ఆత్మసాక్షాత్కారం కల్గుతుందనే ఆశ సైతం మాకు సుదూరం అనిపిస్తోంది.

సుబ్బరామయ్య: మా అవగాహన మానసికమే. భగవాన్ దయతో మీరిట్లు చేయుడని ఆదేశిస్తే మాకెంతో లాభం.

మహర్షి: ఉత్తమసాధకుని ఇట్లుచేయి, అట్లు చేయుమని ఆదేశించేవాడు సద్గురువే కాడు. అతడు తన సాధనలతో అప్పటికే సతమతమౌతుంటాడు. వానికి కావలసింది శాంతి, విశ్రాంతి వానికి వలసింది కర్మనివృత్తి. వాని ప్రయత్నాలు చాలవని, ఇంకా కొన్ని చేయుమని, కాకపోతే అతడు చేసిన వానికి బదులు వేరుకొన్ని చేయుమనడం నిజంగా వానికి సాయపడుటేనా?

కర్మాచరణం సృష్టి - కర్మాచరణం నిజమైన ఆనందాన్ని నష్టపరచడం. కర్మాచరణం విధించేవాడు బోధకుడు గాడు. మారకుడు చంపేవాడు. అట్టివాడు గురురూపంలో బ్రహ్మమైనా కావాలి, యముడైనా కావాలి. అతడు సాధకుణ్ణి ముక్తుని చేయడు సరికదా, వాని బంధనాలను మరింతగా బిగిస్తాడు కూడా.

భ: కర్మను నివారింప జూడటము కూడ యత్నమే గదా? ఎట్టైనా యత్నం తప్పేట్లు లేదు.

మ: నిజమే. ఆ విషయం తాయుమానవర్ చెప్పేయున్నారు. ఒక వైద్యుడు రోగికి సేవించమని మందిస్తూ ఒక షరతు పెట్టాడు - మందు తీసుకొనేప్పుడు కోతిని తలచుకోవద్దని. ఇక ఆ రోగి మందు తీసుకొన్నట్లేనా? దాన్ని

తలంచుకోరాదన్నప్పుడెల్లా జరిగేది దానిస్మరణే గదా?

అలాగే, ఆలోచనలు వదలివేయ యత్నించినప్పుడెల్లా, ఆ ప్రయత్నమే ఆ ప్రయోజనాన్ని భంగపరుస్తుంది.

భ: ఇక దాన్ని సాధించే దెలాగ?

మ: సాధించుటకేముంది? పూర్వం సిద్ధించియున్నది గాకపోతే, దాని సాధన అవసరం. ఇక్కడ నీ స్థితియే అది.

భ: అట్లే అయితే అది మాకెందుకు తెలియడం లేదు.

అణ్ణామలైస్వామి: ఎప్పుడూ నేను "సోహం" (అహం బ్రహ్మాస్మి) అని ఆలోచించాలి.

మహర్షి: ఎవరుగాని 'నేను అది' అనుకోవడమేమి? అదే తాను గదా! ఎప్పుడూ అదే. మనిషి తాను మనిషినని అనుకుంటూనే ఉంటాడా, ఏమిటి?

అనంతాచారి: తాను మనిషిననే భావం లోన ఎంతో గాఢంగా పాతుకొనియుంది. ఆ విధంగా అనుకోవడం మానలేము.

మహర్షి: నీవు మనిషిని అనుకోవాలా? ఎవరన్నా కాదంటేగదా! నీవు జంతువనో అలాగే మరేదో భావం చొరబడితేనే నీవు మనిషి ననుకోవలసి వస్తుంది. అలాగే "నేనది" (I am that) అనే ఆలోచన "నేను మనిషిని" అనే ఆలోచన వదలకుండా ఉన్నంతవరకు అవసరం.

భ: నేను మనిషినన్న ఆలోచన చాలా గాఢమైనది. దాని తొలగించ సాధ్యం కాదు.

మ: నీ నిజస్థితిలో నుండు; "నేను మనిషిని" అని ఎందుకనుకోవాలి?

భ: ఆ భావమంత సహజం గనుక.

మ: కాదు. 'నేనున్నా (I am)'ననేదే సహజం. దానికి "మనషి"ని అని జోడించడం ఎందుకు?

భ: నేను మనషిననేది సుస్పష్టం. 'నేనది' (I am that) అర్థం కావడం లేదు.

మ: నీవదీ గాదు, ఇదీ గాదు. యథార్థం నీవున్నావనేది (I am). 'నేనదే నేను' అని బైబిల్ గూడ అన్నది. ఉనికి యొక్కటే సహజం. దానికి మనిషినని పరిమితి చెయ్యడం అనవసరం.

భ: దీనిపై ఓటు తీసుకుంటేనా, నాకే ఎక్కువ ఓట్లు వస్తాయి (అందరూ నవ్వుతారు).

మ: నా ఓటుగూడ నీకే. (మళ్ళీనవ్వు) నేను మనిషినని నేనూ అంటాను. కాని నేను శరీరానికి పరిమితం గాను; అది 'నాలోనిది'. భేదమిది.

ఒకరు - మానవుని ఉపాధి (పరిమితి) వదల్చుకోవడం కష్టం.

మః నిద్రలో నీవు ఎలా వున్నావు? అప్పుడుగూడ మనిషివన్న ఆలోచన ఉందా?

మరొకరు: కాబట్టి మేల్కొన్నప్పుడు గూడ, నిద్రావస్థ తెచ్చుకోవలెనన్నమాట.

మహర్షి: అవును అదే జాగ్రత్ సుషుప్తి.

భగవాన్ వచించారు: కొందరు నిద్రలోగూడ తాము దేహంలోనే ఎక్కడో ఆవృతులై యుంటి మంటారు. ఆ భావం నిద్రలో నిద్రలో లేదనీ, మేల్కొన్నప్పుడే తోచిందనీ వారు మరచిపోతారు. వారు తమ జాగ్రత్ స్థితిని నిద్రకారోపిస్తారు.

దీపాలు ఆరిపోయాయి. అందరూ వారి వారి స్థలాలకు వెళ్ళిపోయారు.

## భాషణములు 602

కొడైకెనాల్ సెంబగనూర్ లోనిది సేక్రెడ్ హార్ట్ కాలేజి. అక్కడ ఫిలాసఫీ

ప్రొఫెసర్, డాక్టర్ ఎమిలి గథైర్ అడిగారు:

భక్తుడు: మీ ఉపదేశాల సారంశం చెప్తారా?

మహర్షి: అది చిన్న చిన్న పుస్తకాల్లో, ముఖ్యంగా 'నేనెవరు'లో ఉంది.

భ: అవి చదువుతాను. కాని దానిని మీరు వివరిస్తే వినవలెనని ఉంది.

మ: మూలసారమే అది.

భ: తెలియలేదు.

మ: మూలమేదో కనుక్కో

భ: దేముని నుండి నేను వచ్చాను. ఆయన నాకు వేరు గాడా?

మ: ఇట్లు ప్రశ్నించేదెవరు? అడిగేది దైవంగాదు, నీవు అడుగుతున్నావు కాబట్టి నీ వెవరో కనుక్కో అప్పుడు భగవంతుడు నీనుండి భిన్నమో కాదో తెలిసికోవచ్చు.

భ: దైవం సంపూర్ణుడు, నేను కాదు. అతన్ని పూర్ణంగా నేనెట్లు తెలిసికోగలను?

మ: దైవమట్లనడం లేదే. ఈ ప్రశ్న నీకు, నీవెవరో కనుగొన్న తర్వాత దైవమంటే

యేమో తెలిసికోవచ్చు.

భ: మీరు ఆత్మజ్ఞులు. మీరే చెప్పండి. దైవం మీకు భిన్నమేమో?

మ: అది అనుభూతి విషయం. ఎవనికి వాడే అనుభవించి తెలిసికోవాలి.

భ: ఓహో! అలాగా? కాని దైవం అనంతుడు; నేను పరిమితుణ్ణి. నాకొక వ్యక్తిత్వము, ఎన్నడూ దైవంలో లీనంకానిది ఉంది, అవునా?

మ: అనంతం, పూర్ణత - ఇవి విభజింపరానివి. అనంతంలో పరిమితం ఒక భాగమైతే, అనంతం యొక్క పూర్ణత భంగం కాదా? కాబట్టి నీవన్నది పరస్పర విరుద్ధంగా ఉంది.

భ: లేదు. దైవాన్నీ సృష్టినీ - రెంటినీ పరికించండి.

మ: నీకు ప్రత్యేక వ్యక్తిత్వ మున్నట్లు నీకెట్లు తెలిసింది?

భ: నాకొక ఆత్మ ఉంది. అది ఉన్నట్లు దాని కార్యాలబట్టి అనుమానిస్తాను.

మ: నిద్రించేప్పుడు నీకది తెలుసా?

భ: నిద్రలో కార్యాలు విరమింపబడతాయి.

మః కాని నిద్రలో నీవున్నావు. ఇప్పుడూ అట్లే. ఈ రెంటిలో నీ యథార్థస్థితి ఏది?

భ: నిద్ర మెలకువలు తాత్కాలికాలు, వీనికి ఆధారమైన సారాన్ని నేను.

(అతడు తలెయెత్తి టైమ్ చూచాడు. రైలు వేళయింది పోవాలి అన్నాడు. భగవాను వందనములు తెల్పి వెళ్ళిపోయాడు. అంతటితో సంవాదం ముగిసింది)

## భాషణములు 603

లేడి బెట్మన్ తన కూతురితో గూడ భగవాన్ను చూడవచ్చింది. వర్సేల్ లోని పాస్కలిన్ మేయర్ నుండి లేఖ నొకటి తెచ్చింది. దానిలో ఇట్లున్నది -

"ఆశ్రమ ప్రాంగణం వీడి వచ్చి రెండేండ్లైనవి. కాని నా మనస్సక్కడే ఉంది. తమ సన్నిధిని, తమ అలౌకిక మౌనం ప్రసాదించిన సత్య దర్శనాన్ని పలుమార్లు మాయ కప్పివేస్తున్నా సరే"

"క్షణక్షణము మారుతూన్న చీకటి వెలుగుల్లో, ఆత్మబోధము వెండిజిలుగులు పలుమార్లు కనరాకున్నా, ఆత్మదర్శనాకాంక్ష సుస్థిరంగా ఉంది. భగవదనుగ్రహమూ, నా అన్వేషన కలసి అది పెరుగుతూ బలవత్తర మౌతున్నది".

"ఎప్పుడో అరుదుగానే, కారణం తెలియకే ఆత్మబోధము తనంత ఉద్గమించి, తన దీప్తులతో హృదయాన్ని ఆర్ద్రం చేస్తుంది. ఈ స్థితిలో అయత్నంగా చిత్తైకాగ్రత కలిగి, కోర్కెలణిగి, పూర్ణశాంతి నిండియుంటుంది. అంతలో మరొక తెర. సత్యజ్యోతిని కప్పుతూ మరొక మాయావరణము.

"అయినా ఒక మారనుభూతమై, సత్యమని మరలమరల ఎరిగినది, దానిని కాదనుటెలా? మరచుట ఎలా? "ఆ ఉన్నది" బలాన్ని పెంచి, సాధనను పటిష్ఠం చేస్తోంది.

అది సదాస్థితమనితెలిసి, భగవంతుని మిమ్ము, నా ఆత్మజ్యోతిని, జ్ఞానప్రకాశనకై మార్గోపదేశానికై ప్రార్థిస్తున్నాను. మార్పునొందని ప్రేమను తమ పాదములకడ అర్పిస్తూ, - (సంతకం) పాస్కలీన్, 11 రూడి రిజర్వస్ వర్సేల్; 21 నవంబర్ 1938.

## భాషణములు 604

ఒకామె భక్తిగీతం పాడుతున్నది.

"తండ్రివి నీవే తల్లివి నీవే బంధువునీవె, సంపద నీవే ......" చిరునవ్వుతో భగవాన్ అన్నారు - 'అవునవును. నీ వది, నీ విది, ఒక్క 'నేను' తప్పించి, అంతా నీవే. "నేనే నీవంటూ పాటముగించరాదూ."

## భాషణములు 605

ఆంధ్రులొకరు, ప్రశ్నల కాగితమొకటి భగవాన్ కందించారు. సమాధానాలు కోరుతూ, శ్రీభగవాన్ దాన్ని అందుకొని, ప్రశ్నలన్నీ చూచి అన్నారు ఈ ప్రశ్నలన్నీ ప్రశ్నించేవాడొకడున్నాడు గనుక - ఈ ప్రశ్నించేదెవరో వెదకి పడితే, ప్రశ్నలన్నీ తామే మాయమౌతాయి.

భక్తుడు: వీనిని నన్నెందరో అడిగారు. వారికి సమాధానా లివ్వడం నా చేతకాదు. అందువల్ల విషయం తెలియగోరి భగవాన్నడిగాను.

మహర్షి: 'విషయి' యెవరో గుర్తిస్తే 'విషయములు' విశదమౌతాయి.

## భాషణములు 606

శ్రీ వెంకటకృష్ణయ్య, న్యాయవాది, భక్తుడు; పదేండ్లు క్రితం వచ్చియున్నాడు. తన్ను తాను బాగుపరచుకొనే దెట్లని అడిగాడు. గాయత్రీ జపం చేయమన్నారు భగవాన్. తృప్తిచెంది వెళ్ళాడు. కొన్నేండ్లు తర్వాత తిరిగి వచ్చినప్పుడు ప్రశ్నించాడు- "గాయత్రీ మంత్రార్థము ధ్యానిస్తే మనస్సు పరివిధాల బోతున్నది. ఏమి చేయాలి?"

మహర్షి: నిన్ను మంత్రం జపించమనడం జరిగిందా? మంత్రార్థాన్ని జపించమనడం జరిగిందా? మంత్రం జపించే దెవరో విచారించాలి.

అతడే మరొక మహాత్ముణ్ణి చూచినపుడు ఆయన కేవలం 'ఓమ్' అని జపించక 'ఓం నమః'అని జపించమని ఉపదేశమిచ్చాడు. కేవలం 'ఓమ్' సన్న్యాసులకే గాని 'ఓమ్ నమః' అందరూ ఉచ్చరించవచ్చునట.

ఆ విషయం భగవాన్నడిగితే వారు యథాలాపంగా "సన్న్యాసులు కాక మరెవరూ ఆత్మవిచారం చేసి ఆత్మజ్ఞులు కాగూడదా, ఏం?" అన్నారు.

## భాషణములు 607

భగవాన్ లేడి బెట్మన్తో అన్నారు - స్థిరస్థితి ఒకటుంది. జాగ్రత్ స్వప్న సుషుప్తులు కేవలం అందలి చరరాశులు. అవి సినీతెరపై కదలే బొమ్మలవంటివి. ప్రతివాడు తెరను బొమ్మలను గూడా చూస్తాడు. కాని తెరను అసలు గణించక బొమ్మలనే పరికిస్తాడు. జ్ఞాని తెరనేగాని బొమ్మలను లెక్క చేయడు. బొమ్మలు తెరపై నడయాడుతాయి. నిజమే, కాని అవి తెరను బాధించవు. తెర తాను కదలక స్థిరంగా ఉంటుంది.

అలాగే ఒకడు రైల్లో ప్రయాణం చేస్తాడు. తాను కదులుతున్నా ననుకొంటాడు. నిజానికి వాడు తన ఆసనంలో కూర్చును విశ్రమిస్తాడు. వేగంగా పరుగిడేది రైలు. రైలు వేగాన్ని తన కారోపించుకుంటాడు. ఇట్లు చేయగల్గింది తాను దేహమనుకొన్నందున. 'నేనొక స్టేషన్ దాటాను, ఇప్పుడు మరొక స్టేషన్ దాటాను' యిదీ వరస. కాస్త నిదానించి చూస్తే, తాను కూర్చొనే ఉన్నాడు. వానిని స్టేషన్లు త్వరగా దాటిపోతున్నాయి. కాని అంత దూరము తానే ప్రయాణం చేసానని చెప్పక మానడు. ఒక్కొక్క అడుగూ తానే శ్రమపడి నడచివచ్చినట్లు.

సతిస్థితి స్థిరమనీ, నిశ్చలమనీ, అన్ని కర్మలు దాని చుట్టూ జరుగుతాయనీ జ్ఞానికి తెలుసు. అతని స్వభావం మారదు. అతని స్థితి వానిచేత కొంచెమైన బాధితమూ కాదు. అన్నింటినీ ఉదాసీనంగా చూస్తూ తాను ఆనందమగ్నుడై ఉంటాడు.

అతనిదే సత్యస్థితి. అన్నింటికి మూలమూ సహజమూ అయిన స్థితి అదే. అందు చేరేదేమిటి, అందే సుస్థిరుడు కావడమేమిటి, రెండూ ఏకకాలంలో జరుగుతాయి. ఒకమారు ప్రతిష్ఠితుడైతే, సదా సుప్రతిష్ఠితుడే. కాబట్టి పాతాళలింగ గుహలో నుండగా ఏ స్థితో, అదే స్థితి యిప్పుడూనూ, కాని అప్పుడు కదలకుండా ఉన్న శరీరం ఇప్పుడు కదులుతోంది. భేదమంతే.

నడవడికలో జ్ఞానికి అజ్ఞానికి భేదంలేదు. దృష్టిభేదం ముంటుంది. అంతే. అజ్ఞాని తన్ను అహంకారంతో అన్వయించుకొంటాడు; దాని చర్యలను ఆత్మచర్యలని భావిస్తాడు. జ్ఞానికా, అహంకారం నష్టమైపోయింది. అతడీ దేహానికి గాని ఆ దేహానికీ గానీ, ఈ ఘటనకు గాని, ఆ ఘటనకు గాని, దేనికీ కట్టుపడడు.

పైకి కనబడే అకర్మలో కర్మ, పైకికనబడే కర్మలో కర్మరాహిత్యము, ఇది అతని

లక్షణము. ఉదా:

1. నిద్రిస్తున్న బిడ్డ కాహారమిచ్చారు. ప్రొద్దునే లేవగానే వాడు రాత్రి తానన్నం తిననేలేదంటాడు. కర్మవలె కనిపిస్తున్న దానిలో అకర్మకు ఇది ఉదాహరణ. బిడ్డ అన్నం తినడం తల్లి చూచింది. కాని బిడ్డకు మాత్రమది తెలియదు.

2. బండితోలేవాడు పోతూన్న బండిలో నిద్రిస్తాడు. రాత్రియంతా బండి తూలుతూ ఊగుతూ ఎలాగో గమ్యం చేరుకుంటుంది. అంతదూరమూ తానే బండి తోలుకొని వచ్చాననంటాడు బండివాడు. ఇది అకర్మవలె కనిపిస్తున్న దానిలో కర్మ.

3. ఒకడు కథను వింటున్నట్టే కథకుని చూస్తూ తల ఊపుతూఉంటాడు. కాని వాని మనస్సు మరోదానిలో మగ్నమై వాడా కథను వినడు.

4. ఇద్దరు మిత్రులు ప్రక్కప్రక్కనే నిద్రపోతారు. ఒకనికి కల తామిద్దరూ ప్రపంచమంతా తిరిగి వివిధానుభవాల గడించినట్లు. వాడు మేల్కొని రెండవవానితో తమ భూభ్రమణం గురించి చెప్తాడు. రెండోవాడు ఈ కథను అర్థం లేనిదిగా చూస్తాడు.

లేడీ బెట్మన్ కిది నచ్చలేదు. కలలూ, నిద్రా తానిష్టపడే వివరణలు కాదంది. నిద్రను నిజంగా కోరకుంటే నిద్రపోయే ముందు శయ్యను తయారుచేసుకోవడంలో అంత శ్రద్ధ యెందుకూ అని ఆమెను అడిగారు. అంటే అలసిన అంగాలకు విశ్రాంతి నివ్వడానికి ఒక విధంగా తనను తాను మత్తులో పడేసుకోడానికి అంది ఆమె. నిద్రాస్థితి నిజంగా మాంద్యస్థితి. మెలకువలో అందమైన ముచ్చటైన విషయాలెన్నో నిండియుంటాయి అని ఆమె చెప్పింది.

మహర్షి: అందమూ ముచ్చటా నిండియుంటుందని నీవన్న ఆ దశనే జ్ఞాని మందమూ అజ్ఞానభరితమూ అయిన నిద్రగా పేర్కొంటాడు.

“యానిశా సర్వభూతానామ్, తస్యాం జాగ్రతి సంయమీ”

ఒరులకు తమస్సు విరిసిన వేళయే సంయమీ పూర్ణంగా మేల్కొన్న సమయం. నిన్నావరించియున్న నిద్రాస్థితినుంచి నిజంగా నీవు మేల్కోవాలి.

## భాషణములు 608

శ్రీమతి హిక్ రిడ్డింగ్ కాగితంపై రెండు ప్రశ్నలు వ్రాసి భగవాన్కిస్తూ, తన వ్యాఖ్యలు సరిగా ఉన్నవా యని అడిగింది.

మహర్షి: జ్ఞానాజ్ఞానాలు రెంటికి ఆత్మ అతీతం. అది పరమాత్మ. ఈ ప్రశ్నలు ఆత్మకు తట్టవు. అది శుద్ధచిత్ కనుక అజ్ఞాన తమస్సు కందుచోటే లేదు.

భ: ఆ ప్రశ్నలు మా దృష్ట్యా మాత్రమే వస్తాయి.

మ: ఆ ప్రశ్నలెవరివో చూడు. వాని మూలానికి చేరు. అచట చేరాక, అవి వస్తున్నవేమో చూచి, అక్కడే స్థిరపడు.

భః కాని ప్రస్తుతం

మ: అట్టి ప్రశ్నలు తర్కానికే. వానికి అంతమంటూ లేదు. ప్రాక్టికల్గా ఉండాలి. నిర్దేశించిన పద్ధతిలో ఎవని సమస్యలను వాడే పరిష్కరించుకో యత్నించాలి. మార్గము సూచించడం జరిగింది. ప్రశ్నలెవరికి కలుగుతున్నాయో విచారించు. తక్షణమే సమస్యలు తాముగా తీరిపోతాయి.

## భాషణములు 609

మధ్యాహ్నం గం. 3.30 లకు లేడీ బెట్మన్ ఇతరులూ హాలులోకి వచ్చారు. కొన్ని నిమిషాలకే ఆమె ఒక ప్రశ్న వ్రాసి భగవాన్ కందించింది.

భక్తురాలు: మెలకువలో కంటే గాఢ నిద్రలో హెచ్చుగా శుద్ధచైతన్య సమీపంలో ఉంటామా?

మహర్షి: ఆత్మస్థిరమైనది. అది సరళమైన ఎరుక మాత్రమే. జాగ్రత్ స్వప్న సుషుప్తులు దానిపై కనబడే కల్పనలు. ఏ క్షణమైనా ఎవరైనా ఆత్మకు దూరంగా నిలువగలరా? అది సాధ్యమైతేనే నీ ప్రశ్నకు తావుంటుంది.

భ: మెలకువలో కన్న గాఢనిద్రలోనే వ్యక్తి శుద్ధచిత్కు ఎక్కువ సన్నిహితమని పలుమార్లు చెప్పబడుతూ ఉంటుంది కదా?

మ: మునుపటి ప్రశ్నయే, కొద్దిభేదంతో - 'మేల్కొన్నప్పటికంటే నిద్రలోనే నేను నాకు దగ్గరగా ఉన్నానా?' అని అడుగవచ్చు.

ఆత్మశుద్ధ చైతన్యము. దానికెవ్వరూ ఎన్నడూ దూరముగా ఉండలేరు. ద్వైతభావముంటేనే నీ ప్రశ్న వీలవుతుంది. శుద్ధచిత్ స్థితిలో ఎట్టి ద్వైతభావమూ ఉండబోదు.

నిద్రించేది, కలగనేది, మేల్కొనేది ఒక వ్యక్తియే. జాగ్రదవస్థ సుందరమూ, ఆసక్తికరమూ అనుకొంటారు. అట్టి అనుభవం లేనందువల్ల నిద్ర మందగతి యనిపిస్తుంది. ఆపై చర్చకు ముందుగా ఒక విషయం స్పష్టం కావాలి. నిద్రలో

నీ వున్నావని ఒప్పుకుంటావా?

భ: అవును. ఉన్నాను.

మ: ఇప్పుడు మేల్కొని ఉన్నది ఆ నీవేనా?

భ: అవును.

మ: కాబట్టి నిద్రాజగత్తులకు అనుస్యూతంగా (continuity) ఉంది. ఆ అనుగమమెట్టిది? అది కేవలము శుద్ధమైన ఉనికియే.

ఆ రెండవస్థలకూ భేదమొకటున్నది. దేహము జగత్తు విషయాలు మొదలైనవి. సామాన్యంగా మెలకువలో కనుపించి నిద్రలో అదృశ్యమౌతాయి.

భ: కాని నిద్రలో నాకేమీ తెలియదుగదా?

మ: నిజమే. దేహజగద్భావన లందుండవు. కాని ఇప్పుడు 'నిద్రలో నాకేమీ తెలియ'దనటానికి నిద్రలో నీవుండ వలసిందే. అది ఇప్పుడు చెప్పేది ఎవరు? మేల్కొన్న వ్యక్తి గదా? నిద్రిస్తున్న వాడు అలా అనలేడు. అంటే, ఆ వ్యక్తి ఎవరైతే ఆత్మను దేహంతో తాదాత్మ్యం చేస్తున్నాడో. ఆ వ్యక్తి నిద్రలో చైతన్యం లేదంటాడు. నీవు దేహ మనుకొంటావు గనుకే, నీ చుట్టూ జగత్తును చూస్తావు. మెలకువలో సర్వమూ సుందరమూ సంతోషప్రదమూ అంటావు. నిద్ర నీకు మాంద్యస్థితి యనిపిస్తుంది. నీవక్కడ వ్యక్తిగా లేవు. అలాగే ఈ విషయాలూ లేవు. యథార్థమేమి? స్థితి, అంటే ఉనికి; ఆ మూడవస్థల్లోనూ అనుస్యూతంగా ఉంది; వ్యక్తీ, విషయాలు అలాలేవు.

భ: అవును.

మ: ఏది అనుస్యూతమో (continuous) అది శాశ్వతము గూడ, విరళము,( dis-continuous) తాత్కాలికము.

భ: అవును.

మ: కాబట్టి కేవలస్థితి శాశ్వతము: జగత్తు శరీరాలు కావు. అవి నిత్యస్థిరాలైన సచ్చిత్తులనే తెరపై క్షణంలో మాయమయ్యే ఛాయలు.

భ: వానిని పరస్పరం పోల్చిచూస్తే జాగ్రత్ కన్న సుషుప్తి శుద్ధ చైతన్యానికి దగ్గరగా లేదా?

మ: ఒక విధంగా, ఉంది. నిద్రనుండి జాగ్రత్తుకు వస్తున్నప్పుడు, “నేను” ఆలోచన ఆరంభం కావాలి. మనస్సు ప్రవృత్తమవుతుంది; ఆలోచనలు మొదలౌతాయి. శరీరచేష్టలు మొదలౌతాయి; ఇన్నీ కలిస్తే, మనం మేల్కొన్నామంటాము. ఈ పరిణామం యావత్తూ లేకపోవడం, నిద్రా లక్షణం. అందువల్ల అందు మెలకువలోకంటే హెచ్చుగా శుద్ధచైతన్యానికి దగ్గరగా ఉంది.

అంతమాత్రానికి ఎప్పుడూ నిద్రాస్థితినే కోరరాదు. ఒకటి, అది సాధ్యం కాదు. అది ఇతరావస్థలతో క్రమానుగతము. రెండు- అది జ్ఞానిదైన ఆనందస్థితి గాదు. ఆ స్థితి నిత్యము; వస్తూ పోతుండేది కాదు. అదీగాక నిద్రావస్థను ఎరుక గలదిగా జనులు ఎన్నరు. యతికి బోధ సదా ఉంటుంది. కాబట్టి జ్ఞాని సుప్రతిష్ఠితుడైయున్న స్థితికీ నిద్రాస్థితికీ పోలికే లేదు.

ఆలోచనలూ, వ్యక్తిభావనమూ, నిద్రావస్థలో ఉండవు. ఇచ్ఛాశక్తి వల్ల దానిని మార్చవీలుగాదు. ఆ స్థితిలో యే యత్నమూ సాధ్యంగాదు. శుద్ధ చైతన్యం దాపునే ఉన్నా, ఆత్మసాధనా సమర్థములైన యత్నాలకది అనువైన స్థితి కాదు.

ఆత్మసాధన కనువైన ప్రోత్సాహము, ప్రయత్నములు జాగ్రదావస్థలోనే సాధ్యము. నిద్రలోని నిశ్చలత, జాగ్రత్తులో లభించటానికి ఆలోచనలు అడ్డు.

"ఊరకయుండు, నేను దైవమని ఎరుగు" సాధకునికి నిశ్చలతే గమ్యము. ఒక్క ఆలోచననైనా ఏక్షణకాలమైనా నిలుప ప్రయత్నిస్తే లక్ష్యమైన నిశ్చలత మార్గంలో ఎంతో ముందుకు సాగడానికి ఉపయోగపడుతుంది. ప్రయత్న మవసరం. అది జాగ్రదావస్థలోనే వీలవుతుంది. ఇచ్చట యత్నమూ ఉంది, ఎరుకా ఉంది, ఆలోచన లరికట్టడమూ ఉంది. ఆ విధంగా నిద్రలోని శాంతి లబ్ధమవుతుంది. జ్ఞాని స్థితి యట్టిది. అది నిద్రాకాదు, మెలకువా కాదు. ఆ రెంటి అంతరంలో ఉన్నదేదో అందు నిద్రలోని నిశ్చలతా మెలకువలోని ఎరుకా రెండూ ఉన్నవి. దానిని జాగ్రత్ - సుషుప్తి యంటారు. మెలకువలోని నిద్రయో, నిద్రలోని మెలకువో, నిద్ర నెరుగని మెలకువో, మెలకువ నెరుగని నిదురో, దానినెట్లు వర్ణించినా సరే. అది ప్రత్యేకంగా నిద్రగాని మెలకువగాని కాదు. అది 'అతిజాగ్రత్' (జాగ్రత్తుకు అతీతము) లేక 'అతిసుషుప్తి' (నిద్రకు అతీతము) అది పూర్ణచిత్, పూర్ణ నిశ్చలతల సంలీనము. అది మెలకువకూ నిద్రకూ నడుమ అంతరంలోనిది. అట్లే అది రెండు ఆలోచనల మధ్యవుంది. ఆలోచనలన్నిటికీ మూలం అదే. నిద్రనుండి లేచేప్పుడు ఆ విషయం మనకు తెలుస్తుంది. మరొక విధంగా చెప్పాలంటే. ఆలోచనలు నిద్రయందలి నిశ్చలతలో జనించేవే. నిద్రలోని నిశ్చలత మరుగై మెలకువలో

చెలరేగే సంక్షోభానికి కారణం ఆలోచనలే. ఆలోచనల మూలానికి చేరితే నిద్రలోని నిరాకులత నందుకుంటావు. తీవ్రమైన అన్వేషణలోనే దానిని అందుకుంటావు. అంటే సంపూర్ణమైన ఎరుకతోనే అందుకుంటావు.

అదే పూర్వం తెలిపిన జాగ్రత్- సుషుప్తి. అది స్తబ్ధత కాదు; అది కేవల ఆనందము. అది క్షణభంగురం కాదు; శాశ్వతము. దానినుండి ఆలోచనలు వెలువడుతాయి. మన అనుభవాలన్నీ ఆలోచనలుగాక మరేమి? సుఖదుఃఖాలు సైతం ఆలోచనలే. మనలో నున్నవే. నీవు ఆలోచనలు లేకుండా, కాని పూర్తి ఎరుకతో ఉంటే, నీవే పరబ్రహ్మము.

ఇంత విపుల వివరణానికి లేడీ బెట్మన్ ఎంతో తృప్తిచెంది, భగవాన్కు

ధన్యవాదాలు తెలిపింది. మరురోజు తాను తిరిగివెళుతున్నా నన్నది. చిరునవ్వు నవ్వి భగవాన్ అన్నారు - నీ వొకచోటినుండి మరొక చోటికి పోవడం లేదు. నీవు అచలంగానే ఉన్నావు. దృశ్యాలు నిన్ను గడచి వెళ్లు తుంటాయి. మాములుగా చూచినా, నీవు నీ కేబిన్లో కూర్చుంటావు, కదలవు, ఓడ కదలిపోతుంది. సినిమాలో ఒకడు కొన్నిమైళ్ళు అతివేగంగా పరుగిడుతూ మనవైపు ఉరుకుతుంటాడు. కాని తెరకు చలనంలేదు. పాత్రలే కదలి గడచిపోయేవి.

భః అర్థమౌతోంది. కాని ఆత్మసిద్ధి తర్వాతే అది నా యనుభవానికి వచ్చేది. మ: ఆత్మ సదా సిద్ధమే. ఆత్మసిద్ధి ఇకపై పొందవలసిందైతే, అది నష్టం కావటానికీ అంతే వీలుంటుంది. ఆ పక్షాన అది అశాశ్వతం. తాత్కాలికమైన సంతోషం, వెనువెంటనే శోకాన్ని కలిగిస్తుంది. అది శాశ్వతమైన ముక్తికాదు. ఇకపైని ఆత్మను సాధించవలెనంటే, ఇప్పుడది సిద్ధంగా లేనట్లే గదా. ఇప్పు దాత్మలబ్ధి లేకుంటే అది లేని అవకాశాలు భవిష్యత్తులో ఎన్నో ఉండవచ్చు. కాలానికి అవధిలేదు. అప్పుడప్పుడూ కలిగే ఆత్మానుభవం నిలుకడ లేనిది.

కాని, నిజమది కాదు. ఆత్మసిద్ధి తాత్కాలిక మనుకోడం తప్పు, ఆత్మస్థితి శాశ్వతస్థితి, మార్పులేనిది.

భ: అవును, నాకది క్రమంగా తెలియవస్తుంది.

మ: నీవున్నది ఆత్మగనే. ఆత్మ కాలదేశాలచేత బాధితం గాదు. కాలదేశాలు నీలోనివి. అలాగే నీ చుట్టూ చూచే సర్వమూ నీలోనిదే. ఈ విషయం తెలిపే కథ ఒకటుంది.

ఒకావిడ మెడలో విలువైన హారముంది. హడావుడిలో ఆమె ఆ విషయం మరిచింది. హారము పోగొట్టుకున్నానని వలవలలాడింది. ఇంట్లో అన్నిచోట్లా వెదకింది. ఇరుగుపొరుగుల నడిగిచూచింది. వారెవ్వరూ చూడలేదన్నారు. చివరకొక స్నేహితురాలు "మెడతడవి చూసుకో" అంది. అప్పటికి గాని అంతసేపూ ఆ హారం తన మెడలోనే ఉన్నట్లామెకు తెలియలేదు. ఆ విషయం తెలిసాక ఎంతో సంతోషించింది. తరువాత ఇతరు లావిషయం అడిగినప్పుడు ఆ దొరికిందని బదులు పలికింది. అప్పటికి గూడ పోయిన నగ దొరికిందనే ఆమె భావం.

నిజంగా ఆమె నగపోయిందా? అంతసేపూ ఆమె మెడలోనే ఉంది గదా. కాని ఆమె భావాలు గమనించు. నగపోయిందని విచారం, మళ్ళీ దొరకినదన్న సంతోషం. అలాగే మన విషయంలోనూ. ఆత్మతప్ప మరేదీ మనం కాకున్నా దాన్ని సాధిస్తా మనుకొంటాము.

భ: భూమిపై కాకుండా మరెక్కడో విహరిస్తున్నాననిపిస్తున్నది.

శ్రీ భగవాన్ జాబులు చూచుకొంటూ నవ్వి అన్నారు -

మ: ఇదే దివ్యలోకము. బైబిల్ ప్రశంసించిన స్వర్గరాజ్యము, ఈ జగత్తూ భిన్నదేశాలు కావు. "ఆ రాజ్యము నీలో వుంది" అన్నది బైబిల్. అదే సరి. జ్ఞాని దీన్ని స్వర్గరాజ్యముగ చూస్తాడు; ఇతరులు దీనిని ప్రపంచమనే భావిస్తారు. భేదం దృష్టిభేదంవల్ల.

భ: ప్రపంచాన్ని, అందులోని జనులను ఎట్లు కాదనగలం? నేను సంగీతం వింటున్నాను. అతి మధురంగా దివ్యంగా ఉన్నది. అది వ్యాగ్నర్ సంగీతమని గుర్తిస్తాను. అది నా సంగీతం అనలేను కదా.

మ: వ్యాగ్నర్గాని, వాని సంగీతంగాని నీకు వేరుగా ఉన్నవా? అది వ్యాగ్నర్ సంగీత మనడానికి అక్కడ నీవు లేకుంటే నీకది తెలియగలదా? తెలియకనే, అది ఉన్నదనగలవా? ఇంకా స్పష్టం చేస్తాను. గాఢనిద్రలో వ్యాగ్నర్ సంగీతాన్ని గుర్తింపగలవా? నిద్రలో నీవున్నావని ఒప్పుకొంటావు. కాబట్టి వ్యాగ్నర్, అతని గానమూ నీ ఆలోచనలె అని స్పష్టము. అవి నీలో ఉన్నాయి. నీకు వెలుపలివి గావు.

భ: ఎంతో చక్కగా ఉంది. (వివరణ)

(సంకలన కర్త వచనము - ప్రతివారూ అప్పుడప్పుడూ భ్రాంతిచెందటం సహజం. సత్యం విని అర్థం చేసుకున్నా, ఒక్కొక్కమారు దాన్ని మరచిపోతాము. విషయ వివేచనంలో పొరపాట్లు వస్తాయి. జ్ఞానం స్థానే అజ్ఞానం, సందిగ్ధత చొరబారుతాయి. ఆలోచనలను అప్పటప్పటికి సరిదిద్దగలిగినది జ్ఞాని యొక్కరే. సత్సంగావశ్యకత అందుకొరకే. )

## భాషణములు 610

ఈ క్రింది ప్రశ్నల పట్టీతో ఒక భక్తుడు -

1. జీవాత్మ, బ్రహ్మము లొకటే గనుక, ఈ సృష్టికి కారణమేమి?

2. బ్రహ్మజ్ఞానికి శరీరబాధ, పునర్జన్మలుండునా? అతడు జీవితాన్ని తగ్గించుకోటంగాని పెంచుకోవటంగాని చేయగలడా?

మహర్షి: నీ వ్యక్తిత్వపు అవ్యవస్థను తొలగించటానికే ఈ సృష్టి, నిన్ను నీ దేహంగా భావించావని నీ ప్రశ్నలే తెలుపుతున్నాయి. ఆ భావన కారణంగానే నిన్నూ, నిన్ను చుట్టిన ఈ జగత్తును చూస్తున్నావు. నీవు నీ దేహమని నీ ఆలోచన. నీ మనోబుద్ధులే ఈ తప్పు తాదాత్మ్యానికి కారణం.

నీ నిద్రలో నీ వున్నావా?

భక్తుడు: ఉన్నాను.

మ: ఆ నీవేకదూ ఇప్పుడు మేల్కొని ప్రశ్నించేది?

భ: అవును.

మ: ఈ ప్రశ్నలు నిద్రలో నీకు స్ఫురిస్తాయా?

భ: లేదు.

మ: ఏం, ఎందుచేత? నీ దేహాన్ని నీవు చూడలేదు గనుక, ఆలోచనలు రాలేదు. అప్పుడు నిన్ను నీవు దేహంగా భావించలేదు. కనుకనే ఈ ప్రశ్నలు కలుగలేదు. ఇప్పుడట్లు భావిస్తున్నావు. కాబట్టి ఆ ప్రశ్నలు వస్తున్నవి. అవునా, కాదా?

భ: అవును.

మ: ఇప్పుడు నిజమైన నీ స్వభావమేమో గుర్తించు. ఆలోచనలు లేకుండా వున్నదా లేక ఆలోచనలతో కూడి ఉన్నదా?

ఆలోచనలు ఉంటూ పోతూ వుంటాయి. ఉనికి అవిరళంగా సాగేది. వీనిలో శాశ్వతమేది?

భ: ఉనికి.

మ: అదీ విషయం. దాన్ని తెలుసుకో. నీ నిజమైన స్వభావమది. నీ స్వభావం ఆలోచనలు లేని సరళమైన ఉనికి.

నీవు దేహంతో తాదాత్మ్యం చెందుతున్నందువల్ల సృష్టిని గురించి తెలుసుకోవాలనుకుంటున్నావు. జగత్తూ, నీ దేహంతో సహా సకల విషయాలూ నీ మెలకువలో కనపడి నిద్రలో మాయమౌతాయి. మూడవస్థల్లోనూ నీవున్నావు. స్థిరంగా మూడు అవస్థల్లోను ఉన్నది ఏమిటి? దాన్ని కనుక్కో అదే నీ ఆత్మ.

భ: అది కనుగొన్నా మనుకొందాం. ఆ పైన?

మ: ముందది కనుక్కొని చూడు. ఊహాపోహాల ప్రశ్నల వలన ప్రయోజనం లేదు.

భ: అయితే నేను బ్రహ్మముతో ఒకటిగా ఉన్నానా?

మ: బ్రహ్మమును వదలిపేద్దూ. నీ వెవరో చూడు. బ్రహ్మన్ విషయం ఆయన చూచుకొంటారు.

నీవు దేహంతో తాదాత్మ్యం మానిన రోజున సృష్టి, జననం, మరణం ఇత్యాదుల గూర్చి ప్రశ్నలు రావు. అవి నీ నిద్రలో రాలేదు. అలాగే ఆత్మస్థితిలోనూ కలుగవు.

సృష్టి ప్రయోజనం స్పష్టమే, నీవున్న స్థానమేదో తెలిసికొని, అచ్చటినుంచి బయలుదేరి నీ నిజస్థితిని చేరుకోవటం.

నిద్రలో నీకే ప్రశ్నలూ రాలేదు. అక్కడ సృష్టి లేదు గనుక. ఇప్పుడు ప్రశ్నిస్తావు. నీ ఆలోచనలతో బాటు ప్రపంచమూ గోచరించింది గనుక. సృష్టి అంటే నీ ఆలోచనలు మాత్రమే.

నిన్ను నీవు చూసుకో; బ్రహ్మజ్ఞాని తన జాగ్రత తాను చూచుకొంటాడు. నీ స్వభావం నీ వెరిగితే బ్రహ్మజ్ఞాని స్థితిని తెలిసికోగల్గుతావు. దాన్ని ఇప్పుడు వివరించడం వృథా. బ్రహ్మజ్ఞాని యొకడెదుటనున్నా డనుకొన్నావు గనుక నీవు నిన్ననుకొన్నట్లే అతన్నీ దేహంగా భావించి, నీకువలెనే అతనికి సుఖశోకాలు కల్గుతున్నాయనుకుంటావు.

భ: ఆయనచే ప్రభావితుణ్ణి కాగోరితే, ఆయన బ్రహ్మజ్ఞాని అని నాకు తెలియాలిగదా.

మ: అవును. ఆయనే తెలుపుతాడు; నిన్ను ఉత్సాహపరుస్తాడు. అతడు చెప్పినట్లు చేయి. నీవు నేర్చుకోవడానికి వచ్చావు, పరీక్షించడానికి కాదు.

శాస్త్రాలు జ్ఞానలక్షణాలు వివరించాయి. దుఃఖనివృత్తి, సుఖప్రాప్తికోసం ప్రోత్సాహము ఇవ్వడానికి మార్గాలు నిర్దేశించాయి. వాని ననుసరిస్తే ఆ లక్షణాలుగల జ్ఞానం లభిస్తుంది. అవి ఇతరులను పరీక్షించుట కుద్దేశించినవి కావు.

## భాషణములు 611

భక్తుడు: ఆత్మ, లోపలి వెలుగని నా భావం. మృతి తర్వాత అది బ్రహ్మైక్యం చెందితే జీవికి మరుజన్మ ఎట్లు సాధ్యం?

మహర్షి: ఎవనిలోనిది? ఎవని మృతి?

భ: అట్లయితే నా ప్రశ్నను మరో విధంగా అడుగుతాను.

మ: తర్కం కట్టిపెట్టి సమాధానమేమో చూడు.

భ: ఎలా?

మ: నీవు దేహంతో తాదాత్మ్యం చెందటం వలన, ఆత్మకి లోపలి వెలుగంటున్నావు. అంటే దేహంలో వెలుగుందనేనా నీ అర్థం? కొంచెం ఆలోచించు. ఏ ప్రశ్నసైనా దేహం అడగగలదా? అది జడము.

'నే'ననే అనలేదు. 'నే'ననేది మరేదో. అది యేది? ఆత్మ గావచ్చునా? ఆత్మ శుద్ధము. అన్యమెరుగనది; దానికి 'నే'ననవలసిన పనేలేదు. మరి 'నే'నన్నదేది? అది శుద్ధచిత్ (ఆత్మ)కు జడ (దేహ)మునకు మధ్య యేదో, అదే అహంకారం. ఇప్పుడు నీవెవరు? పుట్టిన దేది? ఆత్మ నిత్యము, దానికి పుట్టువు లేదు. దేహ మగుపడుతుంది. అంతర్ధాన మవుతుంది. అట్టి దానితో అన్వయించుకొని పుట్టుచావు లంటున్నావు, తత్త్వతః 'నేను'కు పుట్టువు గలదేమో చూడు. పునర్జన్మ ఎవరికి?

భ: స్వామీ, మేము మా సందేహములను తీర్చుకో వచ్చాము.

మ: తప్పకుండా.

భః ప్రశ్న అడిగితేగాని మా సందేహాలు తీరవు.

మ: అదీ నిజమే. ప్రశ్నించటాన్ని ఎవరూ అడ్డం చెప్పరు.

భ: 'పరిప్రశ్నేన సేవయా' (తిరిగి తిరిగి ప్రశ్నించడం ద్వారా) అన్నారు. కాని

మేము ప్రశ్నలడగాలి. గురువులు దయతో మా సందేహ నివృత్తి చేయాలి.

మ: ఆ వాక్యాన్ని పూర్తిగ చెప్పు. "ఉపదేక్ష్యన్తి జ్ఞానం" (సత్యాన్ని బోధిస్తారు)

భ: అవును. కాని మా సంశయాలు తీరాలి కదా?

మ: అర్జునుని విషయంలోనూ అంతే. చివరకతడంటాడు - 'నష్టో మోహః స్మృతిర్లబ్ధ్వా' (అజ్ఞానం తొలగింది, స్మృతి తిరిగి లభించింది)

భ: అది చివరకు అంతకు పూర్వం అతడెన్నో ప్రశ్నలు అడిగాడు.

మః ప్రారంభంలోనే సత్యప్రకాశనమైంది. శ్రీ కృష్ణభగవానుని మొదటి యుపదేశ

శ్లోకమే - 'పుట్టువు లేదు, చావు లేదు, వికార్యముగాదు....' ఇత్యాది. భః శ్రీ కృష్ణులే అనలేదా - "మనమెన్నో జన్మలెత్తియున్నాము. నేనది ఎరుగుదును, నీ వెరుగవు" అని

మ: అది శ్రీకృష్ణులు తానాదిత్యునికి బోధించిన సందర్భంలోనిది. సత్యం ఆదిలోనే తెలుపబడింది. అర్జునున కది బోధపడలేదు. జ్ఞానస్థితి, జ్ఞానప్రాప్తి మార్గము ఆ తర్వాత తెలుపబడ్డాయి. సందర్భవశాత్తు, శ్రీ కృష్ణులు సత్యం నిత్యమనీ, ఆదిలో తానది ఆదిత్యునకి బోధించానని అన్నాడు. అంతకాలమూ అర్జునుడు తన్ను దేహమే అనుకుంటున్నాడు. ఎదుటనున్న కృష్ణుడూ తనువేయని భావించాడు. అందుకే యన్నాడు - 'అదెట్లు? నీవు దేవకికి జన్మించి కొద్దియేండ్లే గదా అయింది? ఆదిత్యుడు సృష్ట్యాదివాడు. అతనికి నీవు సత్యాన్ని బోధించుట ఎట్లు పొసగుతుంది?' అని,

ఆ తరువాత అర్జునుని ధోరణిలోనే అతని ప్రశ్నలకు శ్రీ కృష్ణుల సమాధానాలున్నవి. 'మనకెన్నో జన్మాంతరాలుండినవి. వాని నన్నింటినీ నే నెరుగుదును. నీ వెరుగవు...." అంటూ,

భ: మాకుగూడ సత్యం తెలియవద్దా?

మ: సత్యమేమో నీకు తెలుపబడింది. మార్గమూ నిర్దేశింపబడింది. నీ నెవరో చూడు. మొత్తం ఉపదేశం ఇదే.

## భాషణములు 612

శ్రీమతి హిక్ రిడ్డింగ్ ఒక ప్రశ్న వ్రాసి ఇచ్చింది.

సద్గురుని అనుగ్రహ వీక్షణగాని, వారినే తిలకించుటగాని ఆత్మసాధనకెంతో తోడ్పడుతుందని శ్రీ భగవాన్ వ్రాసియున్నారు. దీనిని సరిగా అర్థం చేసుకోవడం ఎలా?

మహర్షి: గురువెవరు? సాధకు డెవరు?

భక్తుడు: ఆత్మ.

మ: రెండూ ఆత్మయే అయితే, ఈ ప్రశ్న లెలా కలిగాయి?

భ: వచ్చిన కష్టమే అది. ఆత్మను నాలోనే విచారించాలి. అటువంటప్పుడు, పై వాక్యాని కర్థమేమి? అది విరుద్ధంగా తోస్తున్నది.

మ: నీవు దాన్ని సరిగా అర్థం చేసుకోలేదు.

సాధకుడు గురువు నాత్మగా తెలుసుకుంటే ఇతరత్రా గూడ అతనికి ద్వంద్వభావన ఉండదు. అతడు సుఖి. అతని కే సంశయాలుండవు.

కాని సాధకుడా సత్యాన్ని ఆచరణలోకి తీసుకురాడు. దానికి అజ్ఞానం కారణం. అయితే ఈ అజ్ఞానం యథార్థం కాదు. ఈ అజ్ఞాన నిద్రనుంచి సాధకుని మేల్కొల్పడానికి గురువు కావాలి. అందుచేత ఇతరులకు సత్యం విశదపరచడానికి గురువు ఈ విధంగా బోధిస్తాడు.

ప్రధానమైనది ఆత్మదర్శనం. నీ వెక్కడున్నా యిది చేయవచ్చు. ఆత్మను లోపలే వెదకాలి. ఈ వెదకటం చాల పట్టుదలగా చెయ్యాలి. అది సాధ్యమైతే, శారీరకంగా గురువు దగ్గరే ఉండనక్కరలేదు.

పైన చెప్పబడింది, తామున్న చోటనే ఉంటూ ఆత్మాన్వేషణ చేయలేని వారికై ఉద్దేశింపబడింది.

వార్డ్ జాక్సన్ - అర్థం చేసుకోడానికి ఆమె నిజంగానే కష్టపడుతోంది. ఆ బాధ నేనూ పంచుకొనేదే. ఆమె అడిగేదిది - ఆత్మను మాలోనే చూడగలవాడు గురు దర్శనానికని ఇంతదూరం ఎందుకు వచ్చినట్లు? ఎంతకాలంగానో ఆయన్ను స్మరించాము. ఇక్కడకు రావడం సరియైన పనియని నమ్ముతున్నాము. అది అనవసరమంటారా?

మ: మీరు రావడం మంచిపనే. 'ఈశ్వరో గురు రాత్మేతి'. (ఆత్మయే ఈశ్వరుడు, గురువు) ఒకడు సుఖాన్ని అన్వేషించి, సుఖప్రదాత ఈశ్వరుడొక్కడే అని చివరకు తెలిసికొంటాడు. అతన్ని పూజించి ప్రార్థిస్తాడు. ఆ ప్రార్థనలు విని, వాని కనుకూలించుటకై ఈశ్వరుడు గురురూపంతో సాక్షాత్కరిస్తాడు. సాధకునికి సత్యం తెలిసేందుకై వాని భాషలోనే మాట్లాడాలిగదా, అందుకని. ఈ విధంగా గురువు మనిషిరూపంలోని దైవము. సాధకుని ప్రయోజనానికని ఆయన తన అనుభవాన్ని వివరిస్తాడు. ఆయన అనుభూతి ఆత్మస్థితి. ఆత్మలోనిది. దైవము, గురువు, ఆత్మ - ఇవి ఆత్మసిద్ధిమార్గంలో పైకి కనుపించే పరిణామదశలు. పుస్తకాలు చదువుతుంటే ఎన్నో సంశయాలు కలుగుతాయి. అవి తీర్చుకోవడానికి మీ రిక్కడికి వచ్చారు. అది మంచిదే.

శ్రీమతి రిడ్డింగ్: గురువే ఆత్మయని, దానిని లోపల వెదకాలి అని అర్థమైంది. అంటే దానిని నేనెక్కడ ఉంటే అక్కడే చేయవచ్చు.

మ: తెలుసుకోవడం సిద్ధాంతపరంగానే, ఆచరణలో పెట్టేటప్పుడు కష్టాలు సందేహాలూ వస్తాయి. నీవున్న చోటునే గురుసన్నిధిని అనుభవం చేయగల్గితే నీ సంశయాలు సులువుగా తీరుతాయి. ఎందుకంటే సాధకుని సంశయ నివారణ గురుని ధర్మము గనుక.

ఇకపై నీకే సంశయాలు కలుగకుంటే నీ ఈ రాక సఫలమైనట్లే. ఆత్మవిచారంలో స్థిరపడడానికి పట్టుదలగా ప్రయత్నించు.

భ: ఈ విషయం పూర్తిగా అర్థమైంది.

మ: మంచిది. అభ్యంతరం నీ నిర్ణయానికి గాదు, నీ సందేహాలకి,

వార్డ్ జాక్సన్: చదివేప్పుడు బుద్ధి వినియోగించే చదువుతాము. కాని దూరాన ఉన్నామని తోస్తుంది. మిమ్ము దేహధారిగా చూచినప్పుడు, సత్యానికి దగ్గరగా ఉంటాము. అందుచేత బుద్ధ్యాగ్రహించిన దాన్ని ఆచరింపగలమన్న ధైర్యం కలుగుతుంది.

పాశ్చాత్య దేశంలో ఎవరన్నా ఆత్మజ్ఞుడై, ఆత్మజ్ఞుని రీతిగా వర్తిస్తే, వానిని పిచ్చివాళ్ళ హాస్పిటల్లో చేరుస్తారు. (అందరూ నవ్వుతారు).

మ: నిన్ను నీవే గదిలో తాళం వేసుకుంటావు. ప్రపంచానికి మతిభ్రమించింది గనుక నిన్ను కూడా మతి భ్రమించినట్లు గణిస్తుంది. ఈ పిచ్చి ఆస్పత్రి ఉండేది నీలోనే గదా? నీవు దానిలో ఉండవు. అది నీలో వుంటుంది. (నవ్వు).

ఆత్మజ్ఞానం కలిగేవరకు, అనిశ్చితాలు, సంశయాలు, భయాలు ఉంటాయి అహంకారం ఉన్నచోట అవి ఉండకమానవు. నిజానికి అహంకారమంటే అవే.

భ: అవి అంతరించే దెలాగ?

మ: అసలు అహంకారమే అవి. అహంకారంపోతే అవి పోతాయి. అసలు అహంకారమే నిజం కాదు. అహంకారం ఏమో విచారించు. దేహము జడము. 'నే'నని చాటుకోలేదు. ఆత్మశుద్ధ చైతన్యము, అద్వయము. అదీ 'నే'నని ప్రకటించలేదు. నిద్రలో ఎవ్వరూ 'నే'నని ఘోషించరు. మరి అహంకారం ఏమి? జడదేహానికి, ఆత్మకూ అంతరంలోనిది. దానికి స్వయంగా స్థితిలేదు. దానికై వెదకితే అది కొరివిదెయ్యంవలె మాయమౌతుంది. చీకటిలో ఏదో తన ప్రక్కనే ఉన్నట్లు ఒకడు

భ్రమపడతాడు. అదేదో నల్లని వస్తువుగావచ్చు. దగ్గరగా చూస్తే దయ్యం కనిపించదు; కాని ఏదో చెట్టో, స్తంభమో ఏదో వాడు గుర్తించగలిగిందే అయి యుంటుంది. జాగ్రత్తగా చూడకపోతే అది దయ్యమై భయం గొల్పుతుంది. దగ్గరగా వెళ్ళి చూడాలి. అంతే, మరి దయ్యం కనుపించదు. అసలుంటేగా కనిపించటానికి? అహంకారం అలాంటిదే. దేహానికి శుద్ధచైతన్యానికి నడుమ అస్థిత్వము లేనిది అహంకారం. అది నిజం కాదు. దగ్గరగా చూడనంత వరకది ఇబ్బంది పెడుతూనే ఉంటుంది. కాని దానికై వెదికితే అది కనబడదు.

హిందువుల పెండ్లిండ్లలో, అయిదారు రోజులు విందులు జరిగేవి. ఎవరో కొత్తవాడు వచ్చాడు. 'ఎవరో మగపెండ్లివారివైపు ముఖ్యుడని ఆడపెండ్లివారాతన్ని ప్రత్యేక శ్రద్ధతో చూసుకొన్నారు. అంత విశేషాదరం పొందుతున్నవాడు పిల్లవైపు పెద్దయని మగపెండ్లివారు అతన్ని మిక్కిలిగా సంభావించారు. ఏదో విషయంలో సంప్రదించవలసిన మగపెండ్లివారు ఆయనకై వెదకినారు. ఏదో గొడవవుతుందని గ్రహించిన అతడు చల్లగా అక్కడినుండి జారుకున్నాడు. అహంకార విషయమట్లే. వెదకు, అది మాయమయిపోతుంది. వెదకకపోతే దానితో గొడవ తప్పదు. దాని సన్వేషించే విధం, ఆ అనుభవం ఉన్నవారి నడిగి తెలుసుకోవాలి.

అందుకే గురువును సమీపించటం.

భ: వెదకటంలోనే అయితే, దానికి శారీరకంగా గురుసన్నిధి కావాలా?

మ: సంశయాలు సర్వం పోయేదాకా అవసరమే.

భ: అహంకారం మిథ్య, ఇబ్బందులు కల్గించేది. అయితే, దాన్ని వృద్ధిచేయడానికి మనమెందుకింత శ్రమించడం?

మహర్షి: దాని పెంపు, అందువల్ల తలఎత్తే అలజడి వలన నీవు దాని మూలాన్ని అన్వేషించెలాగ చేస్తుంది. అది పెరుగుట, విరుగుట కొరకే.

భ: ఆధ్యాత్మికంగా పురోగమనం, శిశుసమంగా నుంటేనే వీలన్నారు గదా?

మ: అవును. శిశువులో అహంకారం పెరిగియుండదు గనుక.

భ: నే నెంచినదీ అదే. అహంకారం పెంచుటకన్నా బిడ్డగా ఉండి పోతే బాగుండేది.

మ: శిశువుగా కాదు, శిశుస్థితిలో. ఆత్మసాధన యెట్లో శిశువునొద్ద ఎవ్వరూ నేర్చుకోలేరు. గురుస్థితి శిశుస్థితివలె ఉంటుంది. ఇరువురిలో భేదము ఉంది. శిశువులో అహంకారం ఉంటుంది. అది తర్వాత పెరుగుతుంది. యతిలో అది సమూలం నాశం చేయబడింది.

భ: అవును ఇప్పుడర్థమౌతున్నది.

మ: సత్ ఏకము, నిత్యము. దాన్ని అర్థం చేసుకొంటే అంతవరకూ మంచిదే. కాని తత్పూర్వమైన అజ్ఞానం తిరిగీ రాకూడదు. సత్యజ్ఞానము ఆకళింపు అయిన తరువాత అది తిరిగి పోనీక, తగు జాగ్రత్తలో కాపలా కాయాలి.

ఒక శిష్యుడు ఎన్నోయేండ్లు గురువును శుశ్రూషించి, చివరకు ఆత్మజ్ఞుడైనాడు. వాడానందభరితుడై గురువుకు కృతజ్ఞత తెల్పుకోనెంచాడు. ఆనందాశ్రువులు రాలినవి; కంఠం గద్గదమయింది. అతడన్నాడు - ఇన్నేండ్లుగ నేను నా ఆత్మనే తెలియకపోవడం కన్నవింత ఉందా? ఎంతో బాధపడ్డాను. ఎంతో కరుణించి తాము నా ఆత్మసాధనకు తోడ్పడ్డారు. తమ అనుగ్రహ ఋణం ఎలా తీర్చుకోగలను? అది నా శక్తికి మీరినది. గురువు బదులు పల్కారు - “సరే సరే” మళ్ళీ అజ్ఞానంలో చిక్కుకొనక సత్యమైన నీ ఆత్మలో ప్రతిష్ఠితుడవై ఉంటే, ఋణం తీర్చుకొన్నట్లే.”

(సంకలనకర్త వచనము - ఆత్మయే గురువు, సర్వమూ. ఆత్మసిద్ధియంటే శరణాగతి. గురువులో లీనంకావడం. అంతకన్న ఎవరుగాని చేయగల్గిందేమి? అదే గురువుకు తెల్పే ఉత్తమోత్తమమైన కృతజ్ఞత).

## భాషణములు 613

ఒక యువకుడడిగాడు: ఆలోచనలు ఒక పదార్థమా?

మహర్షి: అంటే, నీ చుట్టూ చూస్తావే, ఆ పదార్థాలవంటి వనేనా?

భ: అవును, స్థూలములా?

మ: ఈ ప్రశ్నించే దెవరు? ఈ ఆలోచించేదెవరు?

భ: ఆలోచించేవాడు ఒక శక్తి (స్పిరిట్)

మ: శక్తి, పదార్థానికి కారణమంటావా?

భ: నాకు తెలుసుకోవలెననే ఉంది.

మ: పదార్థానికి శక్తి ఏవిధంగా భిన్నమంటావు?

భ: శక్తి చైతన్యము; పదార్థం అట్టిదిగాదు.

మ: చైతన్యం నుండి అచేతనం జనిస్తుందా? కాంతి చీకటిని పుట్టిస్తుందా?

## భాషణములు 614

కొందరు పెద్ద మనుష్యులు హాల్లో ఉన్నారు. వారితో భగవాన్ కాసేపు మాట్లాడారు. 'గతాన్ని జ్ఞప్తికి తెచ్చుకున్నా, భవిష్యత్తును ముందే కనుగొన్నా ఏమి ప్రయోజనం? ప్రస్తుతాన్ని చూసుకోవడమే ముఖ్యం. దాన్ని గూర్చి జాగ్రత్తపడు; మిగతావి అవే సర్దుకుంటాయి.

భక్తుడు: దేనినైనా కోరుకోవడం తప్పా?

మహర్షి: కోరిక తీరితే పొంగు, తీరకపోతే క్రుంగు. ఇవి కూడదు. కోరిక పూర్తి అయినప్పుడు కల్గే సంతోషం మోసగిస్తుంది. లాభం, ఎప్పటికైనా నష్టంకాకపోదు. కాబట్టి సంతోషంలో ఉబ్బిపోవటం పిదపకాలంలో బాధకరంగా పరిణమిస్తుంది. ఏది ఎట్లయినా సుఖదుఃఖ భావనలకు తావీయరాదు. సంఘటనలు వ్యక్తిని ఎలా ప్రభావితం చేస్తాయి? ఏదో పొందినంతనే పెద్దగా పెరిగిపోవు; అది నష్టమైతే కృశించిపోవు. ఎప్పుడూ ఎలాగో, అలాగే ఉండు.

భ: లౌకికులం, మేము కోరికలను ఆపుకోలేము.

మ: కోరితే కోరవచ్చు. కాని ఫలితమేదైనా, సిద్ధపడే ఉండు. యత్నించు, కాని ఫలితంతో అలజడి చెందకు. ఏది జరిగినా నిశ్చలంగా ఉండు. సుఖదుఃఖాలు మనోవృత్తులు. వాస్తవాలకూ వానికీ సంబంధం లేదు.

భ: ఎలా?

మ: దక్షిణభారతంలో ఒక గ్రామం. అక్కడ ఇర్వురు స్నేహితులు, బాగా చదువుకున్నవారు. వారి కుటుంబాల నాదుకోనెంచి ధనార్జన తలపెట్టారు. తల్లిదండ్రుల సెలవుపొంది ఇద్దరూ యాత్రకని కాశీకి బయలుదేరారు. దారిలో ఒకడు చనిపోయాడు. రెండవవాడు ఒంటరి అయినాడు. కొంతకాలం దేశసంచారం చేసాడు; కొద్దినెలలకే అతడు పండితుడన్న పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. ఆర్జనపరుడూ అయ్యాడు. ఒకనాడతడు ఒక యాత్రికుణ్ణి కలసుకోవడం తటస్థించింది. అతడు దక్షిణం వెడుతున్నాడు. వాడు వెళ్ళే దారిలోనే ఉంది తన యూరు. మరికొంత సంపాదించాకనే తిరిగి వెళదామనుకొన్న అతడా యాత్రికుని ద్వారా తన తల్లిదండ్రులకు సందేశం పంపాడు. తాను కొంత ఆర్జించి త్వరలోనే తిరిగివచ్చి వారిని కలుసుకొంటాననీ, తనతోడి మిత్రుడు చనిపోయాడని వారికి తెలుపమని కోరాడు. ఆ యాత్రికుడట్లే ఆ ఊరుకెళ్ళి ఆ తల్లిదండ్రులను కలుసుకొని వార్త నందించాడు గాని మిత్రుల పేర్లు చెప్పడంలో తారుమారైంది. ఫలితం బ్రతికేఉన్న వాని తలితండ్రులు కొడుకు చనిపోయాడని దుఃఖించారు. చనిపోయినవాని తలిదండ్రులు బోలెడు డబ్బుతో తమ బిడ్డ రానున్నాడని వానికై ఎదురుచూడ సాగారు.

యథార్థానికి సుఖదుఃఖాలకూ పొంతనం లేదని తెలిసిందా. ఆ భావాలు కేవలం మానసికాలే.

## భాషణములు 615

భక్తుడు: అహంకారాన్ని నాశనంచేయడం ఎలాగ?

మహర్షి: మొదట దాన్ని చేజిక్కించుకో. ఆ తరువాత దాన్ని నాశంచేసే ఉపాయం అడగవచ్చు. ఈ ప్రశ్న నడిగేదెవరు? అహంకారమే. అహంకారం ఎన్నడైనా తన్ను తాను నిర్మూలించుకొన ఇష్టపడుతుందా? ఈ ప్రశ్న అహంకారాన్ని పెంచేదే గాని త్రుంచేది గాదు. అహంకారాన్ని వెదకితే అది లేదని తెలుస్తుంది. ఆ వెదకటమే దాన్ని నశింపచేసే విధానం.

ఈ సందర్భంలో ఒక చిత్రమైన ఘటన జ్ఞప్తికి వస్తున్నది. నేను మధురైలో పడమటి చిత్తిరైవీధిలో ఉన్నరోజులు. పొరుగింటి ఆయన వారింట్లో దొంగలు పడనున్నారని ముందే ఊహించి, వారిని పట్టుకొనే ఏర్పాట్లన్నీ చేశాడు. వీధిరెండు చివరల్లో మఫ్టీలో పోలీసుల నుంచాడు. అలాగే తన ఇంటి వెనక ద్వారం వద్ద సందువాకిట కాపలా ఉంచాడు. అనుకున్నట్లే దొంగ వచ్చాడు. అందరూ వాణ్ణి పట్టుకొన పరుగెత్తారు. పరిస్థితులను చూచి వాడే బిగ్గరగా పట్టుకో, వాణ్ణి పట్టుకో అదుగో పరుగెడుతున్నాడు – అక్కడే - అక్కడే' అని అరుస్తూ వాడు తప్పించుకొని పోయాడు.

అహంకారం విషయం అంతే. దాన్ని వెదకితే అది దొరకదు. దాన్ని వదల్చుకొనే ఉపాయమదే.

## భాషణములు 616

భక్తుడు: జీవనాడి అంటూ ఉన్నదా? ఊహాకల్పితమేనా?

మహర్షి: యోగులు జీవనాడి, ఆత్మనాడి, లేక పరానాడి ఒకటి ఉందని పేర్కొన్నారు. కేంద్రం ఒకటి ఉన్నదనీ, దానినుండి వేలకొలది నాడులు శాఖోపశాఖలుగా వ్యాపిస్తాయని ఉపనిషత్తులు తెలుపుతున్నాయి. దాని స్థానం మేధస్సని కొందరూ, ఇతర భాగాల్లోనని ఇతరులు ప్రతిపాదించారు. గర్భోపనిషత్తులో పిండోత్పత్తి గర్భకోశంలోని శిశువు పెరుగుటను వర్ణిస్తుంది. ఏడవనెలలో జీవుడు బ్రహ్మరంధ్రం ద్వారా శిశువులో ప్రవేశించునట. శిశువు పుట్టిన కొత్తలో బ్రహ్మరంధ్రం చాల మెత్తగావుండి స్పందిస్తూండటమే వారి వాదాన్ని నిరూపిస్తుందన్నారు. కొన్ని నెలలుగాని బ్రహ్మరంధ్రం గట్టిపడి ఎముకగా తయారుకాదు. ఈ వాద ప్రకారం జీవుడు పైనుండి వచ్చి, బ్రహ్మరంధ్రం ద్వారా లోనికి ప్రవేశించి, శరీరంలో సర్వత్రా వ్యాపించిన నాడీసహస్రాలలో వ్యవహరిస్తాడు. అందువలన సత్యాన్వేషి తన మూలం మరల చేరుకోవడానికై సహస్రారమునే, (మేధనే) ధ్యానించాలి. మూలాధారంలో చుట్టలు చుట్టుకొని యున్న కుండలినిని లేపేందుకు యోగికి

ప్రాణాయామము ఉపయోగిస్తుంది. ఈ శక్తి ఉత్థానం సుషుమ్నా నాడిగుండా జరుగుతుంది. అది వెన్నుపూస అంతరంలోనుండి మెదడు వరకు ఉంటుంది.

ఒకరు సహస్రారం పైనే చిత్తం నిలిపితే సమాధి తత్పరత రావడంలో సందేహం లేదు. కాని వాసనా నాశనం మాత్రం కాదు. యోగి సమాధినుండి లేవాల్సిందే, బంధవిమోచన ఇంకా కాలేదు కనుక. లోన మిగిలియున్న వాసనలు వాని సమాధినిష్ఠకు విక్షేపం కలుగచేస్తాయి. అట్లుగానీయక, వాసనలనెల్ల వదల్చుకోవటానికై అతడింకా యత్నించవలసే ఉంది. కాబట్టి అతడు సుషుమ్నలో కొనలుసాగిన జీవనాడి ద్వారా సహస్రారం నుంచి హృదయానికి దిగిరావాలి. ఆ విధంగా సుషుమ్న ఒక వంపు. అది మూలాధారం నుండి వెడలి వెన్నుపూస నెగబ్రాకి మెదడుచేరి, అటనుండి వంపుతిరిగి హృదయంలో అంతమౌతుంది. హృదయం చేరాక యోగికి సమాధి శాశ్వతమౌతుంది. కాబట్టి అంతిమ కేంద్రం హృదయం అని అర్థమౌతుంది.

కొన్ని ఉపనిషత్తులలో ప్రాణ (vital) నాడితో సహా 101 నాడులు హృదయంనుండి వ్యాపిస్తాయని ఉన్నది. యోగులన్నట్లు జీవుడు పైనుంచి వచ్చి, మేధలో ప్రతిఫలిస్తే ఉపయోగ్యమైన ప్రతిఫలకము (రిఫ్లెక్టింగ్ సర్ఫేస్) ఒకటుండాలి. అనంత చైతన్యాన్ని దానిలో పరిమితంచేసే శక్తి దానికుండాలి. అంటే సమష్టియైన పరమాత్మ వ్యష్టియై జీవుడు కావాలి. ఆ ప్రతిఫలకం వ్యక్తియొక్క వాసనల మొత్తం. కుండలోని నీటివలె అది విషయాన్ని ప్రతిబింబిస్తుంది. కడవలోని నీటిని ఇంకిస్తే ప్రతిబింబమే ఉండదు. ప్రతిబింబములేక విషయమే మిగులుతుంది. ఈ సందర్భంలో ఆ విషయం సమష్టియైన సత్ చిత్. అది సర్వవ్యాపి గనుక అన్నిటా ప్రత్యక్షమే. దానిని ఆభాసం (ప్రతిబింబం) లోనే గుర్తించనక్కరలేదు. అది స్వయంప్రకాశి. ఈ నిత్యచైతన్య దీప్తికి, హృదయంలోని వాసనల ప్రతిఫలన మడ్డురాకుండ, వాని నన్నింటినీ సాధకు డింకింపచేయాలి. అది, అహంకారం మూలం వెదకి హృదయంలో లీనమయితేనే సాధ్యమవుతుంది. ఆత్మసిద్ధి కిది ఋజువైన మార్గం. ఆ మార్గాన నడిస్తే, నాడులు, మేధ, సుషుమ్న, పరా, కుండలిని, ప్రాణాయామము షట్చక్రములు - వీనితో ఎవరూ సతమతం కానక్కరలేదు.

ఆత్మ ఎక్కడో బయటనుంచి వచ్చి, బ్రహ్మరంధ్రం ద్వారా శరీరంలో ప్రవేశించదు. అది ఎప్పుడూ ఉన్నట్లే ఉంటుంది. నిత్యోజ్జ్వలంగా సుస్థిరంగా, నిశ్చలంగా, అవికార్యంగా, మార్పులేపైన తోస్తే, అవి పైపైవేగాని ఆత్మకు సహజమైనవి గావు. ఆత్మ, హృదయం; సూర్యసంకాశంగా స్వప్రకాశము.

దానియొక్క కాంతిలో మార్పులు అగుపించవచ్చు. ఆత్మకూ మనస్సుకూ, ఆత్మకూ శరీరానికీ గల సంబంధం, శుద్ధస్ఫటికానికీ దాని పరిసరాలకూ ఉన్నలాంటిది. ఎర్రని పూలకు ముందు స్ఫటికాన్నుంచితే అది ఎర్రగనే కనుపిస్తుంది. స్ఫటికం వెనుక నున్నది పచ్చనిదైతే అదీ పచ్చగనే తోస్తుంది. మార్పుపొందే మనోదేహాలు ఏమార్పూ రాని ఆత్మవల్ల జనించినవే. వ్యక్తి వాని పరిధుల్లో కట్టుబడుతాడు. కావల్సినదంతా కేవలం ఈ మిథ్యా తాదాత్మ్యం తొలగడమే. అది జరగగానే

నిత్యభాసియైన ఆత్మ, ఏకమూ అద్వయమూ అయిన సత్యంగా వ్యక్తమౌతుంది. మెదడు, దానినుండి వెడలి ప్రధానంగా వెన్నుపూస మూలాధారాల ద్వారా దేహమంతా వ్యాపించే సర్వనాడులూ కలిసినది సూక్ష్మశరీరమని చెప్తారు. ఆ సూక్ష్మశరీరంలో చిదాభాసం (చిత్ ప్రతిఫలనం) కలుగుతుందంటారు.

నేను కొండపైన ఉండగా, నాయన (కావ్యకంఠ గణపతిముని) వాదించారు. "వాసనల స్థానమూ మెదడు. దానిలో ఎన్నో కేశాలు. వానిలో వాసనలు నిండియుంటాయి. హృదయం ప్రసారించే ఆత్మకాంతి ఆ వాసనలను వెలిగిస్తుంది. దానివల్లనే ఏ వ్యక్తి ఆలోచించినా, ఆచరించినా."

కాని నేనదెట్లన్నాను. వాసనలు ఆత్మలో సహచరించేవి, ఆత్మకు వేరుగా నిలువలేవు. నీవన్నట్లు వాసనలు మెదడులోనే ఉండి హృదయమే ఆత్మస్థానమైతే, శిరస్సు ఖండిస్తే, వాసనలెల్లాపోయి వానికి పునర్జన్మే ఉండదు. ఇది నవ్వుచేటు గదా. ఒకవేళ వాసనలతో గూడ మెదడు ఆత్మలో ఉందంటే, నిద్రపోయేప్పుడు తల ఎందుకు వ్రాలిపోతుంది? 'నే'నని

సూచించేప్పుడెవ్వడూ తలను తాకడు. కాబట్టి నిస్సంశయంగా ఆత్మ హృదయంలోనే ఉంది. అందే, అతి సూక్ష్మరూపంతో వాసనలూ ఉన్నాయి.

హృదయం నుండి వాసనలు ప్రసరింప చేయబడినప్పుడు, అవి ఆత్మకాంతితో కూడియుంటాయి. వ్యక్తి యోచింప శక్తుడౌతాడు. అణురూపంలో నిక్షిప్తాలైన వాసనలు హృదయంనుంచి మేధకు వెళ్ళేమార్గంలో పెరిగి పెద్దవౌతాయి. వాసనల చిత్రాలు మెదడుయనే తెరపై పడతాయి. వానివాని వృత్తి విభజనమూ అందే జరుగుతుంది. మనస్సుకు మెదడు నిలయము. మనస్సు దాని ద్వారానే ప్రవర్తిస్తుంది. అచట జరిగేదిది. వాసన ఒకటి విడివడి కార్యప్రవృత్తం అయినప్పుడు దానికి ఆత్మకాంతి సంపర్కం కలుగుతుంది. అది హృదయంనుండి మెదడుకు వెళ్ళుతూ ప్రమాణంలో పెద్దదౌతూపోయి క్షేత్రమంతా తానే అవుతుంది. ఆ సమయానికి మాత్రం ఇతర వాసనలు వెనుతగ్గుతాయి. మెదడులో ప్రతిబింబించిన ఆలోచన తెరమీది బొమ్మలను పోలి ఉంటుంది. అప్పుడా వ్యక్తికి విషయాలు సుస్పష్టంగా గోచరించాయంటారు. అతడు గొప్ప మేధావిగా, క్రొత్త విషయాల కనుగొన్నవాడుగా పేరుపొందుతాడు. మౌలికమని ప్రశంస నందిన ఆ ఆలోచనలగాని, క్రొత్తగా కనుగొన్నవన్న వస్తుదేశాలుగాని నిజానికి మౌలికాలు గావు, నూత్నాలూ గావు. ఆలోచన ముందే లేనిదేది, వ్యక్తం కాలేదు. ఇతర వాసనలు లేదా ఆలోచనలు అణిగిపోయి లేదా వేరే అత్యవసరమైన వాసనల వలన అతి సూక్ష్మమూ, కంటికి కానరాని ప్రమాణం లోనివిగా ఉండవచ్చు. వాసనాదుల ఉద్ధృతి తగ్గిన తర్వాత, ఆ నవీనమన్న ఆలోచన కనబడుతుంది. ఏకాగ్రతవల్ల ఆత్మకాంతి దానిపై ప్రసరించి అది స్పష్టమూ, విశదమూనై, ఉజ్జ్వలమూ మౌలికమూ ప్రగతిశీలముగా ఘోషింపబడుతుంది. అంతేగాని నిజంగా అది మొదటినుంచీ లోననుండినదే.

ఇట్టి ఏకాగ్రతను యోగశాస్త్రాల్లో "సంయమనము" అన్నారు. ఈ పద్ధతిలో ఒకని కాంక్షలు నెరవేర్చుకోవచ్చు. అప్పుడది సిద్ధి. కొత్తక్రొత్తగా కనిపెట్టామంటారే, అవి ఈ విధంగా సాధించినవే. ఈ పద్ధతిలో ప్రపంచాలే సృష్టించవచ్చు. సిద్ధులన్నిటికీ సంయమనమే మార్గము. కాని అహంకారం ఉన్నంత కాలము సిద్ధులు కలుగవు. యోగపద్ధతిలో ఏకాగ్రత చివరిదశ, అనుభోక్త (అహంకారము) అనుభవము, జగత్తు, ఈ మూడింటిని నశింపచేస్తుంది. కాలక్రమాన పూర్వకామనలెల్ల నెరువేరుతాయి. ఈ సంయమనం వల్ల కొత్త ప్రపంచాన్నే సృష్టించవచ్చు. యోగవాసిష్టంలోని ఐందవోపాఖ్యానము, త్రిపురా రహస్యంలోని గండశైలలోకము ఇందు కుదాహరణలు.

ఆ శక్తులు లేనివారికి సిద్ధులు అద్భుతాలుగ కనుపిస్తాయి. కాని అవి తాత్కాలికం. నశించేవాని నాసించడం వ్యర్థం. ఈ అద్భుతాలన్నీ మార్పునొందని ఆత్మలోనివే. ప్రపంచం లోనిదే గాని వెలుపలిది గాదు. శ్రీరమణగీత (అ 5: 11-12 శ్లో)లో ఇదే చెప్పింది. శరీరంలో విశ్వమశేష ముంటుంది. శరీరం నిశ్శేషంగా హృదయాన సుంటుంది. అందువల్ల సర్వవిశ్వ సంగ్రహరూపము హృదయము. ఆ కారణంగా సంయమనం వేర్వేరు సిద్ధులకై శరీరంలో వేర్వేరు స్థానాలలో చిత్తమేకాగ్రము చేయుటకు సంబంధించినది. విశ్వ లేక విరాట్ సమష్టిని దేహపరిధిలో ఇముడ్చునన్నారు. అదీగాక, ప్రపంచము మనస్సుకు వేరుగాదు; మనస్సు హృదయాని కన్యముగాదు; సత్యసర్వస్వమిది. ఈవిధంగా సర్వప్రపంచ విషయాలూ హృదయంలోనివే. అత్తివిత్తనము సుదాహరించుటలో శ్వేతకేతువునకు తెల్పినదీ విషయమే. మూలము ఒక బిందువు; దానికి ప్రమాణాలు లేవు. అది విశాలవిశ్వంగా విస్తరిల్లనూ గలదు; అపార ఆనందంగా కూడా ఉండగలదు. ఆ బిందువు అంతటికీ కీలకము. అందుండి ఒక్క వాసన వెడలి, విషయి 'నేను'గా విషయముగా, జగత్తుగా విస్తరిల్లుతుంది. మూలమూ, విషయి (అనుభవం పొందే వ్యక్తి) ఈ రెంటినీ మంత్రంలో తెల్పియున్నారు. రెండు పక్షులు, అచ్చంగా ఒకే రూపు, ఒకే మారు ఎగురుతాయి.

స్కందాశ్రమంలో ఉండగా అప్పుడప్పుడూ బయటికి వెళ్ళి ఒక రాతి మీద కూర్చొనేవాణ్ణి. ఒకసారి ఇద్దరో ముగ్గురో నాతో ఉన్నారు; వారిలో రంగస్వామి అయ్యంగారొకరు. తటాలున, ఒక మిడతలాంటి పురుగు, రాతి చీలికల్లో ఎక్కడుండిందో, రాకెట్వలె పైకి దూసుకుపోవడం చూసాము. రెప్ప వాల్చేలోపల అది లక్షలాది మిడతలై మబ్బులాగా ఆకాశాన్ని కప్పేసింది. మాకాశ్చర్యము. అది ఎక్కడినుంచి ఎగిరిందా యని ఆ రాతి సందులో వెదకాము. అది సూది బెజ్జమంత ఉంది. దానినుండి అంత అల్పకాలంలో అన్ని పురుగులు లేవటం అసంభవం అనిపించింది.

అలాగే అహంకారం రాకెట్లాగా దూసుకొనివచ్చి క్షణంలో విశ్వంలాగా విస్తరిస్తుంది.

కాబట్టి హృదయమే కేంద్రము. దానిని విడిచి ఏ వ్యక్తి ఎప్పుడూ ఉండలేడు. దానికి దూరమైతే మృతుడే. వేర్వేరు తరుణాల్లో వేర్వేరు కేంద్రాలనుండి జీవుడు వ్యవహరిస్తాడని కొన్ని ఉపనిషత్తులన్నవి గాని హృదయాన్ని వదలి జీవుడెక్కడికీ పోడు. ఆ కేంద్రాలన్నీ వ్యాపారస్థానాలే (వేదాంత చూడామణి) కట్టుకొయ్యకు కట్టిన ఆవులాగా, హృదయానికి ఆత్మబద్ధమై యుంటుంది. దాని సంచార స్థానం నియమించేది కట్టినతాడు పొడవు. దాని భ్రమణాలన్నీ కట్టుకొయ్య చుట్టూనే.

గడ్డిపోచపై ప్రాకుతున్న జలూకము, పోచ చివరకు వచ్చి, మరొక ప్రాపు వెదకుతుంది. అది దొరకేవరకు ఉన్న పోచకొసకు వెనుకటి కాళ్ళు పట్టిపెట్టుకొని, ముందు దేహాన్ని ఎత్తి మరో ఆసరా దొరికేదాక ఊగులాడుతుంది. ఆత్మసంగతీ అంతే. అది హృదయంలో ఉంటుంది. అవసరాన్ని బట్టి ఇతర స్థానాలలో సంచరిస్తుంది. కాని దాని వ్యాపారాలన్నీ హృదయం చుట్టూరానే జరుగుతాయి.

## భాషణములు 617

వ్యక్తికి గల స్థితులయిదు 1. జాగ్రత్, 2. స్వప్న, 3. సుషుప్తి, 4. తురీయ, 5. తుర్యాతీత. వీనిలో జాగ్రత్ మేలుకొన్నప్పటిది.

ఆ స్థితిలో విశ్వాంశంలో జీవుడూ, విరాడంశంలో పరమేశ్వరుడూ హృత్పద్మంయొక్క అష్టదళాల్లో కలిసి వసిస్తారు - నేత్రాలద్వారా వ్యవహరిస్తారు; ఇంద్రియాల అవయవాల మూలంగా సరిక్రొత్త సుఖాలనెల్ల అనుభవిస్తారు. విస్తృతములూ, స్థూలములైన పంచభూతములు, దశేంద్రియములు, ప్రాణాది వాయుపంచకము, అంతఃకరణలు నాల్గు- ఈ ఇరువది నాలుగు ముఖ్య పదార్థాలు కలిస్తేనే స్థూలదేహము. జాగ్రత్ స్థితి లక్షణము సత్త్వగుణము; దానిని 'అ' అక్షరము సూచిస్తుంది. 'అ' కధిష్ఠాన దైవము విష్ణువు.

స్వప్నావస్థ, కలల స్థితి; అందు తైజసాంశంలో జీవుడు, హిరణ్యగర్భాంశలో పరమేశ్వరుడూ కూడి హృత్పద్మం యొక్క ఆకర్షక పత్రావళిలో (corolla) నివసిస్తాడు. కంఠం వారియొక్క వ్యవహారస్థానం. మనస్సు ద్వారా జాగ్రత్లో సంకలించిన సంస్కారాల ఫలము ననుభవిస్తారు. పదార్థములు పదీ, పంచభూతములూ, మనోబుద్ధులూ - ఈ 17 కలలోని సూక్ష్మ శరీరమై రజోగుణ విశిష్టముగా వుంటుంది. దానిని సూచించే అక్షరము 'ఉ'. దాని కధిదైవతము బ్రహ్మఅని జ్ఞానులంటారు.

సుషుప్తి గాఢ నిద్రావస్థ. అందు జీవుడు ప్రాజ్ఞాంశంలో, పరమేశుడు ఈశ్వరాంశంలో కలిసి హృత్పద్మకేసరాల్లో (stamen) నివసిస్తారు; సూక్ష్మమైన అవిద్యమూలంగా బ్రహ్మానంద మనుభవిస్తారు. కోడిపెట్ట పగలెల్లా తిరిగి, రాత్రికాగానే పిల్లలన్నిటినీ పిలిచి తన రెక్కలతో కప్పి నిద్రించే విధంగా, సూక్ష్మ వ్యక్తి అనుభవించిన జాగ్రత్ స్వప్నానుభూతుల సంస్కారాలతో, కారణశరీరంలో ప్రవేశిస్తాడు. కారణశరీరం అవిద్య నిర్మించింది. అది తమోగుణ విశిష్టం 'మ' అనే అక్షరంచేత సూచితమౌతుంది. 'మ'కు అధిదైవం రుద్రుడు.

గాఢనిద్ర కేవలస్థితి ననుభవించుటేగాని వేరుగాదు. మూడవస్థలకూ వేర్వేరు పేర్లు - త్రికూటములని, దుర్గత్రయమని, త్రిమూర్తులని, ఎన్నెన్నో. హృదయంలో ఆత్మలో సత్ సదాప్రతిష్ఠితమే. మెలుకువలో హృదయాన్ని విడనాడకుంటే, మనోవ్యాపారాలు స్తంభించి బ్రహ్మమొక్కడే ధ్యేయంగా నిలుస్తాడు. ఆ అవస్థను తురీయ మన్నారు. జీవాత్మ పరమాత్మలో ఐక్యమయ్యే స్థితిని తుర్యాతీత మన్నారు. వృక్షగణము లెప్పుడూ సుషుప్తిలో, జంతుగణములు స్వప్నసుషుప్తులు రెంటిలోనూ దేవతలు సదా జాగ్రత్తులో, మానవులు మూడింటా మెలగుతారు. కాని విమల దృష్టిగల యోగి సదా తురీయంలో, అత్యుత్తమ యోగి సదా తుర్యాతీతములోనే వెలుగుతారు.

పామరునికి మూడవస్థలూ అయత్నంగానే మారుతూ ఉంటాయి. కాని తురీయ, తుర్యాతీతావస్థలు అభ్యాసంవల్లనే సాధ్యాలై, మోక్షసాధన సామగ్రిలో ఉత్తమాలుగా ఉంటాయి. జాగ్రత్స్వప్నసుషుప్తులు, ఒక్కొక్కటి మిగత రెంటినీ పరిహరిస్తూ కాలదేశాలకు నియతములై ఉంటాయి. కాబట్టి అవి యథార్థములు గావు.

జాగ్రత్ స్వప్న సుషుప్తులతోడి అనుభవంవల్ల మనకొకటి తెలుస్తుంది. చిత్ ఆత్మస్వరూపంలో, పై అయిదు అవస్థలకునూ విడిపోని ఆధారమై, శుద్ధమై వానికీ సాక్షీభూతమై యుంటుంది. కాని నిద్రావస్థలో దానికి సదృశమైన ఎరుక రీతి కొంత పేరు. దాన్ని ప్రస్తావించే వ్యక్తి 'నా కప్పుడేమీ తెలియదు; నేను గాఢంగా సుఖంగా నిద్రించాననడం' వినబడుతుంది. దీనివల్ల తేలేవి రెండు అంశాలు - 1) నిద్రలో ఏమీ ఎరుగకపోవడం 2) నిద్రాసుఖము. ఇవి నిద్రలో అనుభూతములు కాకపోతే అదే వ్యక్తి, మెలకువలో అట్లు చెప్పలేడు. అనుమానప్రమాణంవలన గూడ అట్లే నిర్ణయించవచ్చు. అన్ని విషయాలను ఆవరించి మరుగుపరచే చీకటిని కన్ను చూచేట్లే, వస్తు జగత్తు నావరించిన అవిద్యా తమస్సును, ఆత్మ పరికిస్తుంది.

ఆత్మ, పరమానంద స్వరూపంలో, బిందువు బిందువులుగా, ఊగులాడే ఆకు జొంపాల్లో దూరిన చంద్రకాంతి లాగా క్షణం మెరిసి, పరుగున మాయమైనప్పుడు, ఆ అవిద్యా అంధకారం అనుభూతమౌతుంది. ఆ అనుభవం మనోమూలంగా ఇంద్రియాల మూలంగా అయిందిగాదు. నిద్రలోగూడ ఎరుక (చైతన్యం) ఉన్నదని అది నిరూపిస్తుంది. దానిని ఎరుగకపోవడం సాపేక్షజ్ఞానం లేనందువల్ల, ఆనందం ఆలోచనల సంక్షోభం లేనందువల్ల.

గాఢనిద్రలో ఆనందానుభూతి యథార్థమే అయితే, మనుజులందరిలో ఒక్కరు కూడా దాన్ని స్మృతికి ఎందుకు తెచ్చుకోరు; నీటిలో మునిగి, అడుగున ఉన్న వస్తువును వెదకి పట్టినవాడు, ఆతురంగా గట్టున్నే ఉన్నవాళ్ళ కది నీటిలోనుండే తెలుపలేడు, తాను తేలిన తర్వాతే తెలుపగలడు. అలాగే నిద్రలోని తన అనుభవాన్ని వాసనలు క్రమంగా తన్ను మేల్కొల్పేదాకా ఆ వ్యక్తి తెల్పలేదు, అంతదాకా తన మాట్లాడే శక్తిని ఉపయోగించలేడు కనుక. కాబట్టి సచ్చిదానందముల వెలుగు ఆత్మయనుట సిద్ధమే.

జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థల్లో విషయికి క్రమంగా విశ్వతైజస ప్రాజ్ఞులని పేర్లు. ఆ ముప్పురికి ఆధారమయిన వ్యక్తి యొక్కడే. అందువల్ల వారెవ్వరూ సచ్చిదానంద స్వరూపమైన సత్యాత్మకు ప్రతినిధులుగారు. గాఢనిద్రలో అనుభవము బ్రహ్మానంద మన్నారు. ఆలోచనలు లేని స్థితి మాత్రమే గనుక ఈ ఆనందము కేవలము . అది కూడా తాత్కాలికమే. అది ఆభాస, పరమానందానికి నకిలీ. ఆనందానుభవంలో అది ఇంద్రియ సుఖాలకు భిన్నంగాదు. గాఢనిద్రలో ప్రాజ్ఞుడు ఆత్మైక్యం చెందాడంటారు. నిద్రలో వ్యక్తిత్వం విత్తనంవలె ఉంటుంది.

అనుభూతులన్నిటికీ ఆధారం ఆత్మయే. అది అన్నిటికీ ఆధారంగానూ, సాక్షిగానూ ఉంటుంది. ఈ విధంగా సత్యం జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు మూడింటికీ భిన్నము.

## భాషణములు 618

హరిద్వార్ వారొకరు: నన్ను నేను విశ్లేషణ చేసుకొంటూపోతే, బుద్ధిని దాటిపోతాను. కాని అందు ఆనందం కన్పించడం లేదు.

మహర్షి: బుద్ధి ఆత్మకు పరికరం మాత్రమే. దానికి అవతల ఉన్న దానిని తెలిసికోడానికి అది ఉపయోగపడదు.

భ: అది అర్థమయింది. కాని దాని కవతల ఆనందం లేదు.

మ: తెలియనివి తెలుసుకోడానికి బుద్ధియొక సాధనం. దాన్ని ఆత్మయను, జ్ఞానమను, అదే నీవు గనుక నీకెప్పటికీ ఎరుక వుంది. కాబట్టి నీవు జ్ఞాన విషయం కావు. బుద్ధి నీ వెలుపలివి తెలియచేస్తుంది. కాని తనకే కారణమైన దానిని (మూలాన్ని) చూపలేదు.

భ: నా ప్రశ్న అదే.

మ: నిన్ను నీవు విశ్లేషించుకొనేవరకే బుద్ధి; ఆపైన కాదు. అంతట అది అహంకారంలో విలీనం కావాలి. అహంకారం మూలాన్ని వెదకాలి. అది జరిగితే అహంకారం అంతరిస్తుంది. మూలంగా ఉండిపో. అహంకారం మళ్ళీ తల

ఎత్తదు.

భ: ఆ స్థితిలో ఆనందం లేదు.

మ: ఆనందం లేదనుకోటం ఒక ఆలోచన మాత్రమే. ఆత్మ కేవలం ఆనందమే. నీవాత్మవు. నీవానందంగా ఉండక తప్పదు. నీవే ఆనందమై, ఆనందం లేదనటం ఎలాగ? అలా అనేది ఆత్మకాదన్న మాట. అది అనాత్మ, ఆత్మ ఆనందం అనుభవించాలంటే అనాత్మను పోగొట్టుకోవాలి.

భ: ఎలా?

మ: ఆలోచన ఎక్కడ పుడుతుందో చూడు; మనస్సునుండి. మనస్సు, బుద్ధి వ్యాపారాలు ఎవనికో చూడు; అహంకారానికి, మనస్సును అహంకారంలో లీనంచేసి, అహంకారం మూలం వెదకు; అది అదృశ్యమౌతుంది; 'నే నెరుగుదును', 'నే నెరుగను' ఇత్యాదులు కర్తను, విషయాన్ని ఊహిస్తాయి. అది ద్వైతభావనవల్ల. ఆత్మశుద్ధము, పరము, ఏకము, ఒంటరి, ఒకటి నింకొకటిని తెలిసికోడానికి, ఆత్మలు రెండు లేవు. మరి ద్వైతమేమి? ఆత్మ ఒంటరి, ఏకము గనుక ద్వైతము ఆత్మకాదు, అనాత్మయే అయిఉండాలి. ద్వైతము అహంకార లక్షణము. ఆలోచనలు కలిగినప్పుడు రెండనే భావముంది; అది అహంకారం అని గుర్తించి దాని మూలం వెదకు.

ఆత్మసాధనలో నీ పరిణతి యెంతో, నీ ఆలోచనల పరిమితి నిర్ణయిస్తుంది. కాని ఆత్మసిద్ధి, ప్రగతి భావననే ఒప్పుకోదు. అది ఉన్నరూపుగానే ఎప్పుడూ ఉంది. ఆత్మానుభవంలో ఆత్మఎప్పుడూ ఉండవలసిందే. ఆలోచనలే దానికి అడ్డు. అట్టి ఆటంకాల నెన్ని తొలగిస్తే అంత పురోగమించావన్నమాట. ఆలోచనలు ఎవరికో విచారించి, వాని నరికట్టాలి. వాని మూలం చేరుకో. అక్కడ మరి ఆలోచనలు పుట్టవు.

భ: సందేహాలు ఎప్పుడూ వస్తున్నాయి. అందుకే నా ప్రశ్న.

మ: సంశయము, సమాధానము: మరో ప్రశ్న, ఇంకొక జవాబు: దీని కంతులేదు. కాబట్టి అన్ని సంశయాలు తీరడం సాధ్యం కాదు. సంశయాలెవరికో చూడు. దాని మూలంచేరి అక్కడే నిలిచిపో. ఆపైన సందేహాలు రావు. సందేహాలు రాకుండే విధానం అదే. "ఆత్మసంస్థం మనఃకృత్వా, నకించిదపిచింతయేత్" (మనస్సును ఆత్మలో నిలిపి, మరి వేరే ఏమీ ఆలోచించక)

భ: భగవాన్ అనుగ్రహము మాత్రమే దానిని ఇవ్వగలదు.

మ: అనుగ్రహం ఎక్కడో వెలుపల లేదు. మీ అనుగ్రహము కావాలి అన్న కోరికే, నీలో ఇప్పటికే ఉన్న అనుగ్రహానికి గుర్తు.

## భాషణములు 619

బృహదారణ్యకోపనిషత్తులోనిది మైత్రేయీ బ్రాహ్మణము. దాని అర్థం సంకలిస్తున్న వివేకచూడామణి పద్యాన్నొక్కటిని వల్లిస్తూ, ఒక ఆంధ్రుడు అందులోని 'ఆత్మ' పదాని కర్థమేమని అడిగాడు.

మహర్షి; ఆత్మయే.

భక్తుడు: దాని అర్థం వేరే దానిపై ప్రేమ కాదా?

మ: నిత్యస్థితమైన ఆత్మానందానికి గుర్తు సుఖవాంఛ. కాకుంటే నీకా కోరిక యెందుకు? తలపోటు మనిషికి సహజమే అయితే ఎవడైన దాన్ని పోగొట్టుకో యత్నిస్తాడా? తలనొచ్చే ప్రతివాడూ ఆ బాధ పోగొట్టుకో యత్నించేవాడే. ఆ నొప్పిలేని స్థితి వానికి తెలుసు గనుక. తనకేది సహజమో దాన్నే మనిషి కోరుతాడు. సుఖం కోరినాడంటే, సుఖం వానికి సహజం గనుక, సహజమే గనుక దాని సంపాదించుటలేదు. వాని యత్నాలన్నీ దుఃఖనివృత్తికే. సహజమైన ఆనందాన్ని అనాత్మ కప్పింది. అనాత్మ శోకానికి అంటే ఆనందరాహిత్యానికి పర్యాయపదం.

దుఃఖనాశం = సుఖ ప్రాప్తి (దుఃఖంపోతే ఆనందం పొందినట్లే) శోకం కలిసిన సుఖం, శోకమే. దుఃఖంపోతే అప్పుడు నిత్యస్థితమైన ఆనందం పొందినట్లు భావిస్తారు. బాధతో అంతమయ్యే సంతోషం కూడా దుఃఖమే అట్టి సంతోషాన్ని ఎవ్వరూ ఆహ్వానించరు.

సంతోషం మూడు విధాలు - ప్రియ, మోద, ప్రమోదములు. కోరిన వస్తువు దగ్గిరగా వుంటే, ప్రియము; అది తనదిగా అయితే మోదం; దాన్ని అనుభవించేప్పుడు ప్రమోదం. ఆయాదశలు సంతోషప్రదాలయ్యే కారణం ఇతర ఆలోచనలన్నిటినీ, ఒకే ఆలోచన తొలగించి, ఆ ఒక్క ఆలోచన కూడా ఆత్మలో కలిసిపోతుంది. ఈ దశలు అనుభవించేది ఆనందమయకోశంలోనే మెలకువలో విధిగా విజ్ఞానమయకోశానికే ప్రాబల్యము. సుషుప్తిలో ఆలోచనలన్నీ మాయమై మిగిలియున్న అవ్యక్తత, ఆనందసమము. అక్కడ ఉన్నది ఆనందమయకోశమే. ఇవన్నీ కోశాలేగాని, మూలవస్తువు గాదు. అది అంతరాంతరాల్లోనిది, జాగ్రత్ స్వప్న సుషుప్తుల కవ్వలిది. సత్యమదే, అదే యథార్థమైన ఆనందముగూడా. (నిజానందము)

భ: ఆత్మవిచారానికి హఠయోగ మవసరం కాదా?

మ: ఎవనికి తగిన మార్గము వాడెన్నుకుంటాడు. దాన్ని నిర్ణయించేది వాని పూర్వసంస్కారమే.

భ: నా వయస్సులో నాకు హఠయోగాభ్యాసం సాధ్యమా?

మ: అవన్నీ ఎందుకు ఆలోచిస్తావు? అది నీ కన్యమని భావించి, దానిని కోరి, దానిని పొందయత్నిస్తావు. ఇంతకాలమూ నీవు లేవా? నిన్ను నీవు వదలుకొని బాహ్యవిషయాలకై ప్రయత్నం ఎందుకు?

భ: 'అపరోక్ష - అనుభూతి'లో ఆత్మవిచారానికి హఠయోగ మవశ్యకమైన సాధనమని ఉంది.

మ: దేహాన్ని ఆత్మవిచారానికి యోగ్యంగా హఠయోగం తీర్చగలదని ఆ యోగ ప్రతిపాదన. ఆత్మవిచార సాఫల్యతకు జీవితం దీర్ఘంగా వుండవలెననీ దాని మతం. ఆ ప్రయోజనానికే కొందరు కాయకల్పం చేస్తారు (కొన్ని మందులు వాడతారు). వారికి నచ్చిన ఉదాహరణ, చిత్రలేఖనకు పూర్వం పటం సువిమలంగా ఉండాలి. అని వాదం. నిజమే, కాని ఇందులో పటమేది? చిత్రమేది? వారి మత ప్రకారం దేహం పటము, ఆత్మవిచారం చిత్రం. కాని దేహం ఆత్మపటంపైని చిత్రమే కదా?

భ: కాని, హఠయోగం ఉపకరిస్తుందనే ఎంతగానో పొగడుతారు.

మ: అవును. వేదాంతనిష్ణాతులైన గొప్ప పండితులు కూడ దాని నభ్యసించే వారున్నారు. అది లేక వారి మనస్సు నిగ్రహించబడదు. అందువల్ల వేరే ఉపాయాల వల్ల మనస్సు నిలువలేనివారికి, హఠయోగం ఉపయోగిస్తుందనవచ్చును.

భ: సగుణోపాసన అసమగ్రమనీ (అసంపూర్ణమనీ) నిర్గుణోపాసన కష్టమూ, ప్రమాదకరమూ అని అంటారు. నేనా మొదటి తరగతివాణ్ణి. నేను ఏమి చెయ్యాలి?

మ: క్రమకాలంలో సగుణం నిర్గుణంలో లయిస్తుంది. సగుణము మనస్సును శుద్ధిచేసి పరమగమ్యంపైపు తీసికొని వెడుతుంది. ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు అందరూ దైవానికి కిష్టులే. కాని జ్ఞాని భగవంతుని ఆత్మయే.

## భాషణములు 620

భక్తుడు: 'నేతి - నేతి' యని సాధకునికి బోధిస్తారు. ఆత్మయే పరమాత్మ అంటారు. దాన్ని కనుగొనే దెలాగ?

మహర్షి: ఆత్మను శ్రోత, మంత, జ్ఞాత యన్నారు. అంతేగాదు. ఆత్మను చెవికి చెవి, మనస్సుకు మనస్సు, జ్ఞాతకు జ్ఞాత యనీ వర్ణించారు. ఏవిధంగా తెలుసుకునేవాణ్ణి తెలుసుకొనేది?

భ: కాని అది ఆత్మయేమో చెప్పడం లేదు.

మ: 'నేతి - నేతి' (ఇది కాదు - ఇది కాదు)

భ: కాని అది నిరాకరణ మాత్రమే.

మ: (మౌనము)

భ: తన కాత్మయేమో చూపించడం లేదని అన్నాడు.

మ: ఒకనికి తన్ను దెలియవలెనన్న కోరిక. వాని చుట్టూ జంతువులూ, ఇతరాలూ వున్నవి. "నీవు గోవు కావు, గుర్రం కావు, చెట్టువు కావు, అవి గావు, ఇవి గావు" అన్నారు. 'నేనెవరో తెలుపలేదని అప్పటికీ అంటే" నీవు మనిషివి కావని చెప్పలేదని సమాధానం. తాను మనిషిని అని తనకు తానే తెలుసుకోవాలి. కాబట్టి నీవేమో నీవే తెలుసుకోవాలి.

'నీవు దేహంగావు, మనోబుద్ధులూ అహంకారం గావు, నీవూహించ గల్గినవేవీ గావు. నిజంగా నీవెవరో తెలుసుకో' అని నీకు చెప్పారు. మౌనానికర్థం "ప్రశ్నించేవాడే, వాడు కనుగోవలసిన ఆత్మ"యని. స్వయంవరంలో కన్య తనకు జూపిన వారి నొక్కొక్కరిని 'కాదు కాదు' అంటుంది. చివరి కామెకు నచ్చినవాని ఎదుట, చూపువ్రాల్చి మౌనం వహిస్తుంది.

## భాషణములు 621

సాయంత్రం గం. 5.30లకు భగవాన్ కొండపై ఒంటరిగానుండగా రాజకృష్ణ కలుసుకొని ప్రార్థించాడు. నా పదవ యేటినుండి సత్యాన్ని కొంచెంగానైనా చూడవలెనని ఆశపడుతున్నాను. ఇందుకు తమవంటి యతీంద్రులే సాయపడగలరని నా దృఢవిశ్వాసం. అందుకై మిమ్ము వేడుకంటున్నాను.

అతనివైపు కొన్ని నిమిషాలు భగవాన్ చూసారు. కాని ఇంతలో అడ్డువచ్చి అతడన్నాడు. - "నా జీవితంలో నాకది లభించకపోయినా, చనిపోయేప్పుడైన దానిని మరవకుందునుగాక. చనిపోయే క్షణంలోనైనా సత్యదర్శనం ఒక మారయ్యేట్లు చేయండి; జన్మాంతరాలలో అది ఉపకరించవచ్చు."

మహర్షి: భగవద్గీత 8వ అధ్యాయంలో ఉంది - చనిపోయే క్షణంలో చివరి తలపు ఆ వ్యక్తి మరుజన్మను నిశ్చయిస్తుందట. సత్యానుభవం జీవితంలో అయితేనే మరణవేళ అనుభవానికి వస్తుంది. ఇప్పటి ఈ తరుణం మునుపటికి భిన్నమేమో చూచి, నీవు కోరే స్థితిలో నిలువ యత్నించు.

భక్తుడు: నా శక్తి పరిమితం. నేనై సాధించలేనిది, అనుగ్రహం ప్రసాదించగలదు. మ: నిజమేకాని, అనుగ్రహం లేనిదే ఈ కోరికే రాదు.

వారిర్వురూ మెల్లగా నడుస్తూ వస్తున్నారు. రాజకృష్ణ అన్నాడు - "లాహొరులో 11 ఏండ్లు పిల్ల, చెప్పుకో తగ్గది. కృష్ణుని రెండుమార్లు పిలిచే వరకు స్మృతియుంటుందట, కాని మూడోమారు పిలిస్తే, ఆమె చైతన్యం తప్పి, పది గంటల సేపు అట్లే వివశయై ఉంటుందట.

మ: కృష్ణుడు నీకు పేరనుకున్నంత కాలం ఆయన్ను ఆహ్వానిస్తావు. వివశత్వం సమాధి తాత్కాలిక మేనని సూచిస్తుంది. నీ వున్నది సదా సమాధిలోనే, గుర్తించవలసిందే అది.

భ: దైవసాక్షాత్కారం అద్భుతం.

మ: దైవసాక్షాత్కారం ఆత్మసాక్షాత్కారమే. నీ ఇష్టదైవానికి నీవే రూపుకల్పిస్తే ఆ రూపుతోనే ఉంటుంది. ఆత్మను తెలుసుకో.

## భాషణములు 622

భగవాన్ చేతిప్రేలికి కట్టుకట్టి ఉంది. అదేమని ఒక భక్తుడడిగాడు. "ప్రేలు వెళ్ళి కత్తిమీద పడిందన్నారు భగవాన్. (కత్తి జడము; దానితో పోలిస్తే ప్రేలు చైతన్యం గలది.)

## భాషణములు 623

మరొక భక్తునికి భగవాన్ తెలిపారు; 5 స్థితులున్నాయి అని. 1. నిద్ర 2. మేల్కొనబోయేముందు, ఆలోచనలు లేనిస్థితి, 3. ఆలోచనలు లేమివల్ల ఫలించిన సుఖానుభవం (రసాస్వాదము) 4. వాసనల కదలికలు (కషాయ), 5. విక్షేపముతోకూడిన పూర్ణజాగృతి. పైన చెప్పబడిన వాటిలోని 2వ దానిని శాశ్వతం చెయ్యాలి.

## భాషణములు 624

భక్తుడు: ప్రతి ఆలోచనతోనూ, కర్త మరియు విషయము రెండూ, కనిపించటమూ అంతరించటమూ ఉంటుంది. కర్త అదృశ్యమైతే, 'నేను' గూడ అదృశ్యం అవుతుంది కదా? అది అలాగే అయితే, ఆత్మవిచారం సాగేదెలాగ?

మహర్షి: కర్త మనోవృత్తి మాత్రమే. ఆ మనోవృత్తి పోవచ్చు; కాని దాని కాధారమైన సత్యం నిలిచే ఉంటుంది. మనోవృత్తికి 'నేను' ఆధారం. దానిలోనే మనోవృత్తులన్నీ లేవడం మరియు మునిగి పోవడం జరుగుతాయి.

భ: ఆత్మను శ్రోత, మంత, విజ్ఞాత అంటూనే మళ్ళీ దాన్నే అశ్రోత, అమంత, అవిజ్ఞాతంగా వర్ణించారే, అదేమి?

మ: అది అట్లే విజ్ఞానమయకోశంలోని మార్పులవల్లనే పామరుడు తన్ను గుర్తిస్తాడు. ఈ మార్పులు తాత్కాలికం. అవి వస్తాయి మళ్ళీ అణగిపోతాయి. అందుకే దాన్ని విజ్ఞానమయకోశమన్నారు. స్వచ్ఛమైన చైతన్యం మాత్రం మిగిలితే, అదే చిత్ లేక పరమాత్మ. ఆలోచనలు పోయిన తర్వాత సహజస్థితిలో ఉండటమే ఆనందం. ఆ ఆనందం అశాశ్వతమైతే, పెరుగుతూ తరుగుతూ ఉంటే, అది ఆనందమయకోశమేగాని, శుద్ధ ఆత్మ కాదు. చెయ్యవలసినది ఆలోచనలు పోయిన తర్వాత శుద్ధమైన “నేను”మీదే చిత్తం నిలిపి, అక్కడే స్థిరపడటం. దీన్ని ఒకరీతిగా అత్యంత సూక్ష్మ ఆలోచన అనవచ్చు. లేకపోతే దాని గురించి మాట్లాడడమే వీలు కాదు. 'ఒకరీతిగా'యేమంటే, అది సాక్షాత్తు సత్యాత్మయే. దాన్ని నిర్వచించే దెవరు, ఎవరికి, ఏ విధంగా?

'కైవల్యం' 'వివేకచూడామణి' దీన్ని చక్కగా వివరించినవి. నిద్రలో ఆత్మబోధ పూర్తిగా నష్టంకాకున్నా, అందువల్ల జీవుని అజ్ఞానం బాధితము కాదు. ఈ అజ్ఞాన నాశానికి వృత్తిజ్ఞానము (సూక్ష్మ మనస్థితి) కావాలి. సూర్యరశ్మికి ప్రత్తి మండదు.

కాని ఆ ప్రత్తిపైన్నే ఒక భూతద్దం ఉంచితే అద్దం ద్వారా ప్రసరించిన సూర్యకాంతి ప్రత్తిని కాల్చివేస్తుంది. అలాగే, ఆత్మజ్ఞానం సర్వదా ఉన్నా, అది అజ్ఞానవిరోధి గాదు. ధ్యానంవల్ల ఆలోచనల సూక్ష్మస్థితిని పొందితే అజ్ఞానమప్పుడు నశిస్తుంది. వివేకచూడామణిలో చెప్పినట్లు 'అతీవ సూక్ష్మం పరమాత్మ తత్త్వం, న 'స్థూలదృష్ట్యా' (పరమాత్మ తత్త్వము అతిసూక్ష్మమైనది; స్థూలదృష్టికది గోచరించదు). 'ఏష స్వయంజ్యోతి రశేష సాక్షీ' (ఇది తానై ప్రకాశించేది, అన్నిటికీ సాక్షి).

ఈ సూక్ష్మ మానసిక స్థితి మనోవృత్తి గాదు. మానసిక స్థితులు రెండు విధాలు, ఒకటి సహజము, రెండవది విషయరూపములుగా చెందిన మార్పు. మొదటిది సత్యము, రెండవది కర్తృతంత్రము. (కర్త ఆధారముగా ఉన్నది) ఈ రెండవది నీటిలో పటిక పొడి లాగ నష్టమైతే, ఆ మొదటిది సదా మిగిలే ఉంటుంది. (నీటిలో పటిక పొడి కలిపితే అది కల్మషాలను తీసుకొని క్రిందకి వెళిపోయి, శుద్ధ జలాలను మిగులుస్తుంది.)

ఈ ప్రయోజనానికి ధ్యానం ఉపాయం. ఇది త్రిపుటి (జ్ఞానము, జ్ఞాత, జ్ఞేయము) లోనిదే అయినా, చివరకది జ్ఞానంగా పర్యవసిస్తుంది. ధ్యానానికి యత్నం కావాలి; జ్ఞానం అయత్నం. ధ్యానం చేయవచ్చు. మానవచ్చు, తప్పుగా చేయవచ్చు, జ్ఞానమట్లుగాడు. ధ్యానము, కర్తృతంత్రము; జ్ఞానము, వస్తుతంత్రము (స్వయంగా పరమాత్మునిదే)

## భాషణములు 625

ఆంగ్లవనిత, కుమారి మర్సటన్- 'నేనెవరన్న పుస్తకం చదివాను. ఆ విచారణ చేస్తే కొంచెంసేపుకూడా చెయ్యలేకపోతున్నాను. నాకు పరిసరాల పట్టింపులేదు. కాని జీవితంలో ఆసక్తి కలుగ గలదన్న ఆశమాత్రం ఉంది.

మహర్షి: అపేక్షలు లేకపోవడం మంచిదే. (అనువాదకుడు చెప్పేడు: ఆమె జీవితంలో ఆసక్తి నపేక్షిస్తున్నదని)- అలా అయితే వాసనలున్నవని అర్థం.

ఒకడు కలగంటాడు. స్వప్నజగత్తులోని సుఖదుఃఖాలను చూస్తాడు. మేల్కొన్న పిదప వానికా స్వప్న జగత్తులో ఏ అపేక్షా ఉండదు. అలాగే జాగ్రత్ జగత్తు కూడా. స్వప్న జగత్తు నీలో భాగమే. నీకు వేరుగాదు, సంసారమనే జాగ్రత్ స్వప్నం నుండి మేల్కాంచి, అది వాస్తవిక సత్యం కాదనీ, నీలోని భాగమేనని గుర్తిస్తే, ఈ ప్రపంచాన్ని సైతం ఉపేక్షిస్తావు. సాధారణంగా నీ చుట్టూవున్న వస్తువిషయాలు నీకు వేరని, వాని నాకాంక్షిస్తావు గాని, నీవు కోరినది కేవలం రూపముగల ఆలోచనే అని తెలిసికొంటే, అటుపై దానిని కోరుకోలేవు.

విషయములు నీటిపై బుడగలు, నీరు నీవు; విషయములు బుడగలు. నీటికి భిన్నంగా అవి వుండలేవుగాని, అవి నీటితో సమానము కావు.

భ: నేను నురుగును అని భావిస్తున్నాను.

మ: నిజము కాని పోలికలను మాను. నిజస్వరూపం తెలిసికో. అప్పుడు నీకు దృఢనిశ్చయం కలుగుతుంది. సందేహాలేవీ రావు.

భ: కాని నేను నురుగునే.

మ: అట్లు నీవనుకొంటావు గనుకే చింత. అది నీ అపోహ. సత్యమే నీవని గ్రహించు. నీరుగా ఉండు, నురుగు అవకు. అందులో మునకవేసినప్పుడు తెలుస్తుంది.

భ: మునిగితే నేను కనుగొనేవి

మ: మునుగకున్నా నీవదే. (తత్త్వమసి). బహిరంతరములు, నీవు నీ నిజస్వరూపాన్ని అంగీకరించనంతవరకే.

భ: మీరు నన్ను మునుగమన్నారనే భావించాను.

మ: అవును చాల చక్కగనే అన్నావు. నీటితోగాక నురుగుతో నిన్నుపోల్చుకుంటే అట్లన్నాను. విషయగ్రహణంలో నీ తికమక చూచి, వెలికిలాగి ఆ అవ్యవస్థ ఇట్టిదని చూపడానికే ఆ సమాధానం. చెప్పవలసిందింతే. ఆత్మ అనంతం. నీవు చూచే సర్వమూ అందే వసిస్తుంది. ఏది దాని కవ్వలగాని, వేరుగాగాని లేదు. ఇది తెలిస్తే నీవు దేనిని కోరవు. ఏమీ కోరకనే తృప్తుడవై వుంటావు.

ఆత్మ సదా సిద్ధమూ, అనుభూతమూ, నిత్యసిద్ధమైనదాన్ని మరల సాధించేదేమి? నీ వునికిని నీవు తిరస్కరించలేవు. ఆ ఉనికియే చిత్ - ఆత్మ.

నీవు లేకుంటే ప్రశ్నలడగలేవు. కాని నీ వున్నావనక తప్పదు. ఆ ఉనికియే ఆత్మ. అది పూర్వం నుండి అనుభవంలోనిదే. నిన్ను నీకు తెలియదన్నది భ్రమయని తెలియచెప్పడానికే, నీ ఆత్మ సాధనా యత్నమంతా. క్రొత్తగా సిద్ధించవలసింది లేదు. ఆత్మ అదే వ్యక్తమౌతుంది.

భ: దానికి కొన్ని సంవత్సరాలు పడుతుంది.

మ: సంవత్సరాలెందుకు? కాలభావన నీమనసులోనిది. ఆత్మలోనిది కాదు. ఆత్మకు కాలమన్న మాటేలేదు. అహంకారం తోచిన తర్వాతనే కాలభావన తోస్తుంది. నీవు కాలదేశాల నధిగమించిన ఆత్మవు. కాలదేశములు లేకున్నా నీవున్నావు.

## భాషణములు 626

వేరొక భక్తుడు: 'నేను' 'ఇది' (అహం - ఇదం)తో సాపేక్షంగా ఉన్నది నిజమేనా?

మహర్షి: “నేను”, “ఇది” తోడుగనే వ్యవహరిస్తున్నాయి. కాని 'ఇది' 'నేను'లో వ్యాప్తం. 'వేరుగావు. 'ఇది' 'నేను'లో లీనమై ఏకం కావాలి. మిగిలి వెలిగే 'నేను' యథార్థమైన 'నేను'.

## భాషణములు 627

భక్తుడు: గురుసాహచర్యమంటే ఏమిటి?

మహర్షి: అంటే వేదాధ్యయనం చేయడం.

భ: గురుసన్నిధిలో విశిష్టత వుంది.

మ: అవును. అది మనస్సును నిర్మలం చేస్తుంది.

భ: అది ఫలము లేదా బహుమానము. నేను అడిగినది శిష్యుని నడవడిక ఎలా ఉండాలని.

మ: అది శిష్యునికి శిష్యునికీ మారుతుంది. అతడు విద్యార్థియా, గృహస్థుడా! వానిలో బలంగా వున్న వాసన లెట్టివి? ఇట్టివాటినిబట్టి యుంటుంది.

భ: అట్లయితే అది సహజంగా చక్కబడుతుందా?

మ: అవును. పూర్వం ఋషులు తమ పుత్రులను విద్యార్జనకై వేరే వారి వద్దకు పంపేవారు.

భ: ఎందుచేత?

మ: ప్రేమ, వాత్సల్యము అడ్డువస్తాయని.

భ: అది జ్ఞానులకెట్లు వర్తిస్తుంది? కాని అది శిష్యుల వైపునుంచా?

మ: అవును.

భ: అయితే అన్ని ఆటంకాలతో బాటు దీన్నిగూడ గురువనుగ్రహం తొలగించదా?

మ: అది ఆలస్యమవుతుంది. గురువుయందు భక్తిశ్రద్ధలుకొంత తక్కువయినందువల్ల, అనుగ్రహం చిరకాలానికి గాని ఉపయోగానికి రాదు.

అజ్ఞానం నుంచి మేల్కొనడం, కలలో భయంకరమైన జంతువును చూచి బెదరి మేల్కొనువంటిది. మనస్సులో రెండు లక్షణాలున్నాయి 1. ఆవరణ. 2. విక్షేపం (అస్థిరత). ఆవరణ చెడ్డది; విక్షేపము అట్లుగాదు. నిద్రావృత్తి ఉన్నంతకాలం, స్వప్నభయం వుంది; లేవగానే ఆ ఆవరణ వీడుతుంది; అటుపై భయముండదు. అస్థిరత సుఖానికడ్డుకాదు. జగత్తు వలని అస్థిరతను పోద్రోలడానికి, వేరొక అస్థిరతను - గురుసన్నిధిని అవిరామకృషి, వేదాధ్యయనం, బహురూపముల దేవారాధనము - చేపట్టుతాడు. వీనివల్ల జ్ఞానం కలుగుతుంది.

చివరకయ్యేది ఏమిటి? కర్ణుడెప్పుడూ కుంతి కొడుకే. పదవవాడు ఎప్పుడూ అట్టివాడే. రాముడెప్పుడూ విష్ణువే. జ్ఞానము అటువంటిది. నిత్యమైన దాని ఎరుకయే జ్ఞానము.

## భాషణములు 628

యూరప్ నుండి తిరిగివచ్చాక శ్రీ డి. భగవానన్ను ఒంటరిగా కొన్ని నిమిషాలపాటు కలుసుకొన్నాడు. అంతకుముందు వచ్చిన ఫలం కొంత లభించింది. కాని తానాసించినంతగా లేదన్నాడు. తను చెయ్యవలసిన పనిపై చిత్తం నిలిచింది. కాని ఆధ్యాత్మ పరిణతికి చిత్తైకాగ్రత కావాలి గదా. కర్మ తనకు నచ్చింది. ఎందుకంటే అది ఏకాగ్రతకు సహాయపడింది.

మహర్షి: కర్తలేక కర్మలేదు. కర్తను వెదకితే అతడు కనరాడు. మరి కర్మ ఎక్కడిది?

భక్తుడు: నాకు ఆచరింప సాధ్యమైన ఉపదేశం కావాలి.

మహర్షి: కర్తకై అన్వేషించు, అభ్యాసమదే.

శ్రీమతి డి.: నా ఎరుక మధ్యమధ్య భగ్నమౌతోంది. దానిని అవిరళంగా ఉంచేదెలా?

మహర్షి: భగ్నం కావటం ఆలోచనల వలన. నీ వట్లనుకోకపోతే భంగమేలేదు. అది కూడా ఆలోచన మాత్రమే. పాత అభ్యాసం మళ్ళీ మొదలు పెట్టు. 'ఈ ఆలోచనలు ఎవరికి?' ఆ అభ్యాసాన్ని నీ ఎరుక సరళమయ్యేదాకా సాగించు. అభ్యాసము వలన మాత్రమే ఎరుకను (చైతన్యాన్ని) ఎప్పుడూ ఉంచగలదు.

## భాషణములు 629

ఈ రోజు శివరాత్రి, సంధ్యవేళ అనుగ్రహ దీప్తులతో శ్రీ భగవాన్ వెలిగిపోతున్నారు. అప్పుడొక సాధకుడు ఆత్మ విచారము సాధకుని సూక్ష్మ శరీ ఇలా అడిగాడు: శరీరము (అతివాహిక శరీరం, పుర్యష్టకము, జీవాత్మ) లోనికి తీసుకొనిపోయేట్లున్నది. అది అట్లేనా?

మహర్షి: ఒకే స్థితికి చాల పేర్లు, కాని అవి వేర్వేరు దృక్పథాలకు వర్తిస్తాయి. కొంతకాలానికి పుర్యష్టక (ఎనిమిది విధాలయిన సూక్ష్మశరీరము) మంతరించి, దాని స్థానంలో 'ఏకమే' నెలకొంటుంది.

అజ్ఞానాన్ని వృత్తిజ్ఞానం మాత్రం నశింపచేయగలదు. పూర్ణజ్ఞానం అజ్ఞానానికి విరోధి కాదు. వృత్తులు రెండురకాలు- 1. విషయవృత్తి. 2. ఆత్మవృత్తి. మొదటిది దాని స్థానంలో రెండవది రావాలి. అభ్యాసప్రయోజనం అదే. అది సాధకుని మొదట పుర్యష్టకానికి, ఆ పిదప 'ఏకాత్మ'కూ చేరవేస్తుంది.

## భాషణములు 630

మాటల సందర్భంలో ఒక భక్తుడున్నాడు -

శివప్రకాశం పిళ్ళై ఎంతో సజ్జనుడు, గాఢభక్తి యున్నవాడు, చిరకాలంగా భగవాన్నుపచరించినవాడు. అంతటివాడు ఒక పద్యం వ్రాస్తూ భగవానుని ఆదేశాలను పాటించడం కష్టంగా ఉందన్నారు. ఇక మాలాంటి వారి గతి ఏమి?

మహర్షి: దేవతాస్తుతులు రచించేప్పుడు శ్రీ ఆచార్యులవారు అలాగనే అన్నారు. అట్లు కాకపోతే దైవస్తుతి ఎలా?

అంటూ శ్రీ భగవాన్ చిరునవ్వు నవ్వారు.

## భాషణములు 631

భక్తుడు: ఆత్మవిచారం అతివాహిక, పురీయాష్టక లేక జీవాత్మకు దారితీస్తుంది. అవునా?

మహర్షి: అవును. దాన్ని 'శరీర'మన్నారు. దృష్టిభేదాన్ని బట్టి దానికే దేహము, వాసము, వ్యక్తి, జీవుడు అని పేర్లు. అన్నీ ఒకటే,

వృత్తి జ్ఞానమని సామాన్యంగా వస్తువిషయాలతో కలిపి వాడుతారు. అవి లేకపోయాక ఆత్మవృత్తి లేక కర్తృవృత్తి మిగులుతుంది. ఆత్మవృత్తియే జ్ఞానం. అది లేకుంటే అజ్ఞానం వీడదు. పుర్యష్టకం గూడ వెలివిషయాలతో కలవదు; ఆత్మ ఒకే రీతిగా, మధురంగా భాసిస్తుంది.

## భాషణములు 632

వేలూరు మహంత్ స్కూలులో ఉపాధ్యాయుడు సత్యనారాయణ రావు, మహర్షి భక్తుడని అందరికీ తెలుసు. అతనికి గొంతులో కాన్సర్, చాల బాధపడుతున్నాడు. డాక్టర్లు ఆశ లేదన్నారు. ఆశ్రమంలో అతనికొక గది ఏర్పాటు చేసారు. శ్రీ సర్వాధికారి అతనికి అన్ని సదుపాయాలూ ఒనగూర్చారు. రెండు నెలలు జరిగాయి. రోగి చాల బలహీనంగా ఉన్నాడు.

ప్రొద్దున గం.9.00లు భగవాన్ ఉత్తరాలు చూచుకొంటున్నారు. రోగి తమ్ముడు ఆందోళనగా హాలులోకి వచ్చాడు. అన్న శ్వాస ఆడక కష్టపడుతున్నాడని చెప్పాడు. ఇంతలో అందుకే శ్రీ సర్వాధికారీ హాలులోకి వచ్చారు. భగవాన్ తపాలు

చూచుకుంటూనే ఉన్నారు. కొన్ని నిముషాలకు మరియొక భక్తుడు, ఆ విషయంగానే అక్కడకు వచ్చాడు. శ్రీభగవాన్ 'డాక్టరును పిలిచారా?" అని అడిగారు.

'ఆఁ, కాని ఆయన ఆస్పత్రి పనిలో మునిగియున్నాడు'

'నేనేం చేసేది? నేనక్కడికి వెళ్ళితే వారికి తృప్తిగా ఉంటుంది.'

త్వరగా భగవాన్ హాలువీడి రోగి గదికి వెళ్ళారు. రోగిని మెల్లగా నిమిరి, తన చేతిని వాని వక్షస్సుపైన రెండో చేతిని తలపై నుంచారు. రోగి నోరు తెరచి ఉంచి, నాలుక బయట వ్రేళ్ళాడుతున్నది. కళ్ళలో చలనం లేదు. కొంత సేపటికి అతనికేమో ఉపశమనం కలిగినట్లుంది. ఇరపై నిముషాలకు మెల్లగా గొణిగినాడు.

- 'అనాథరక్షకా, నిన్నెంత శ్రమపెట్టాను. ఈ కరుణకు ప్రతిగా నేనేమి ఈయగలను?" చుట్టూ ఉన్న వాళ్ళు తేలికపడ్డారు. భగవాన్ హాలుకు తిరిగివెళ్ళారు. చేతులు కడుగుకోవడానికని ఒకరు సోపు, తువాలు తెచ్చారు. వానిని వలదని, భగవాన్ ఆ చేతులతో తన ఒళ్ళు తుడుచుకొన్నారు. తరువాత కొన్నాళ్ళకు సత్యనారాయణరావు చనిపోయాడు.

సుప్రసిద్ధ భక్తులొకరన్నారు - 'ఎట్టి పరిస్థితుల్లోనూ శ్రీ భగవాన్ నిర్లిప్తులుగా ఉంటారు. కాని ఆయన ఎప్పుడూ దయార్ద్రహృదయులు, ప్రేమ మూర్తులే.

## భాషణములు 633

దిండిగల్లునుంచి ఒకరు-'శారీరకంగా మానసికంగా గూడా బాధపడుతున్నాను. గర్భవాసం మొదలు సుఖమన్న దెరుగను. నేను కడుపులో పడ్డప్పటినుంచి, మా తల్లికీ బాధలట. ఇంతగా నేను బాధపడనేల? ఈ జీవితంలో నేనే పాప మెరుగను. ఇవన్నీ పూర్వజన్మలలో చేసిన పాపముల ఫలమా?

మహర్షి: అంతకాలమూ ఆపులేక బాధలే పడుతుంటే సుఖ మెవరు కోరుతారు? అంటే బాధయే సహజస్థితి అయితే, సుఖపడవలెనన్న కోరిక కలిగేదెలాగ? కోరిక కలిగింది నిజం. కాబట్టి సుఖస్థితి సహజం. ఇతరం అసహజం. బాధ నెవరూ కోరరు, అది వస్తూ పోతూ ఉంటుంది గనుక.

ఆ వ్యక్తి మళ్ళీ అదే మొరపెట్టాడు.

మహర్షి: మనోదేహాలూ రెండూ బాధపడుతున్నాయి అన్నావు. అవి ఈ ప్రశ్నలు అడుగుతున్నాయా? ప్రశ్నించే దెవరు? మనోదేహాలు రెంటికీ అతీతుడేకదా ప్రశ్నలడిగేది?

ఈ జీవితంలో దేహము బాధపడుతున్నది అంటున్నావు. దీనికి కారణం గత జన్మ దానికి కారణం దానికి నీ పూర్వజన్మ. అలాగే వెనక్కు పోతుండవచ్చు. కార్యకారణ పరంపరకు, విత్తూ మొలకలకువలె, అంతులేదు. అన్ని జన్మలకూ ఆది కారణం అజ్ఞానం అని చెప్పవలసిందే. ఆ అజ్ఞానం ఇప్పుడూ ఉండి ఈ ప్రశ్న వేయిస్తున్నది. ఆ అజ్ఞానాన్ని జ్ఞానంవల్ల తొలగించాలి.

"ఎందుకు, ఎవనికి, ఈ బాధ?" ఈ విధంగా ప్రశ్నిస్తూ పోతే 'నేను' మనోదేహాల కన్యమనీ, ఆత్మయొక్కటే నిత్యమనీ, అదే పరమానందమనీ తెలుసుకుంటావు. ఇదే జ్ఞానం.

భ: మరి ఈ బాధ ఇప్పుడెందుకుండాలి?

మ: బాధే లేకపోతే, సుఖపడవలెనన్న కోరిక నీకెట్లు కలిగింది? ఆ కోర్కె లేకుంటే, ఆత్మాన్వేషణం సఫలమయ్యే దెలా?

భ: కాబట్టి బాధలన్నీ మంచికే నంటారా?

మ: అవును. సుఖమంటే, ఏమి? ఆరోగ్యంగా అందంగా ఉండే దేహము, వేళకు భోజనము లాంటివా? దేహసౌష్టం ఉన్న చక్రవర్తికి గూడ మితిలేని క్లేశాలు తప్పవు. అన్ని బాధలకు దేహాత్మబుద్ధి ("నేను శరీరము" అనే భావనే) కారణము. అది పోగొట్టుకోవడమే జ్ఞానము.

## భాషణములు 634

ప్రభుత్వోద్యోగం నుండి విరమించిన ఆంధ్రులొకరు ఇలా అడిగారు:

చాల కాలంగా ఓంకారోపాసన చేస్తున్నాను. ఎడమచెవిలో ఏదో శబ్దం వినబడుతూనే ఉంది. నాదస్వరం పోలికగా ఉంటుంది. ఇప్పుడూ దాన్ని వింటూనే ఉన్నాను. తేజస్వంతములైన దృశ్యాలూ కనబడ్డాయి. ఏమి చేయవలెనో తెలియడంలేదు.

మహర్షి: దృశ్యాన్ని, చూచుటకు, శబ్దం వినడానికి, ఒక వ్యక్తి యుండాలి. అతడు 'నేను', 'నేనెవ'రని ప్రశ్నిస్తూ దాన్ని వెదకు. ఆపైన అన్వేషణలేదు. కర్త, కర్మ కలిసిపోతాయి. అంతదాకా ఆలోచనలు వస్తూనే ఉంటాయి, పోతూనే ఉంటాయి. ఏమయింది, ఏమి కాబోతున్నది అని నిన్ను నీవు ప్రశ్నించుకో. కర్త తెలిస్తే, విషయాలన్నీ కర్తలో లీనమవుతాయి. ఈ విషయం తెలియనివాడు తన మనస్సును విషయాభిముఖం చేస్తాడు. ఈ విషయాలు కనిపిస్తాయి. మాయమౌతాయి. అందువలన తన నిజ స్వరూపం అయిన ఆత్మ విషయాలకు భిన్నంగా గల నిత్య వస్తువని గుర్తించలేడు. విషయాలు అదృశ్యం అయినప్పటికీ మనస్సు విషయబద్ధం కనుక, విషయాలు లేనందున దుఃఖం కల్గుతుంది. కాని విషయాలు తాత్కాలికాలు. ఆత్మ శాశ్వతము. నిజమైన ఆత్మ తెలిస్తే, కర్తృకర్మలు రెండూ ఒకటై, ఏకమూ అద్వితీయమూనైన వస్తువు ప్రకాశమాన మౌతుంది.

భక్తుడు: ఓంకారంగూడ లీనం అయిపోతుందా?

మహర్షి: ఓమ్ నిత్య సత్యము. విషయప్రపంచ మంతరించిన పిదప మిగిలి వెలిగేది 'ఓమ్'. అది దేనిలోనూ లీనంగాదు. ఆ స్థితిని గురించి ఇలా అన్నారు. "ఎచట ఎవ్వరూ అన్యమును చూడరో, వేరేదియు వినరో, ఇతరము నేమియూ ఎరుగరో, అది పరమమైన స్థితి" (యత్ర నాన్యత్ పశ్యతి, నాన్యత్ శ్రుణోతి నాన్యత్ విజానాతి స భూమా). ఉపాసనాలన్నీ దాన్ని పొందడానికే. ఎవ్వరుగాని, ఉపాసనలతో చిక్కుపడక 'నేనెవ'రని విచారిస్తూ, ఆత్మను కనుక్కోవాలి.

భ: నాకింట్లో సుఖంలేదు. కుటుంబంలో నేను చేయవలసినదేమీ లేదు. వారికై చేయవలసినదంతా చేసే ఉన్నాను. ఇప్పుడు మనుమలు, మనుమరాండ్రున్నారు. నే నింటిలో ఉండాలా? కాక దానిని వదలి యెచటికైనా పోవాలా?

మ: నీ విప్పుడున్న చోటనే ఉండు. కాని నీవున్న దెక్కడ? నీవింటిలో ఉన్నావా? ఇల్లు నీలో ఉందా? నీకు వేరుగా ఇల్లుందా? నీ స్వస్థానంలో నీవు స్థిరపడితే విషయాలన్నీ నీలో లీనమవడం చూస్తావు. ఇట్టి ప్రశ్నల కప్పుడు తావే ఉండదు.

భ: సరి. నేనింటిలోనే ఉండవలసినట్లున్నది.

మ: నీవు నీ నిజస్థితిలో ఉండితీరాలి.

## భాషణములు 635

హొస్పేట్లో ఉన్న ఆంధ్రులు ఒకరు కైలాస్, అమర్నాథకు యాత్రచేసి తిరిగివచ్చారు. ఆ ప్రదేశాలు ఎంత అందమైనవో, అచటికి పోవడమెంత ప్రయాసో వర్ణించారు. చివరకతడు మహర్షిని గుర్తుంచుకోవడానికై ఏదైనా ఉపదేశమివ్వమని కోరాడు.

మహర్షి: నీవు కైలాస్ వెళ్ళావు గదా, ముక్తినాథ్ చూచావా?

భక్తుడు: లేదు, అది నా శక్తికి మించినది, కాని నేపాల్ వెళ్ళియున్నాను.

తాము ఈ స్థలాలకు వెళ్ళియున్నారా? మహర్షి: లేదు, లేదు. ఏదో యథాలాపంగా ముక్తినాథ్ ప్రస్తావించాను, అంతే.

"కైలాస్ వెళ్ళి తిరిగిరావడం, మళ్ళీ కొత్త జన్మఎత్తినట్లే. అక్కడ దేహబుద్ధి పోతుంది."

## భాషణములు 636

శ్రీమతి కెల్లీహాక్: జాగ్రత్ స్వప్నాలను, సహజస్థితినున్న ఆత్మకు విహార స్థానాలుగ ఊహించవచ్చా?

మహర్షి: విహరించడాని కొక ప్రదేశం ఉండాలి కదా? అదిగూడ తనకు

వెలిగా. ఆత్మ సహజస్థితి కది అసాధ్యం.

భ: అట్లూహించవచ్చునా, అని యన్నాను.

మ: అంతకన్నా ఆత్మ నిజస్థితినే ఊహించరాదా?

భ: సినీతెర ఉపమానం చాల మనోహరంగా ఉంది.

మ: సినీతెర జడము, దానికొక ద్రష్ట అవసరం. కాని ఆత్మపటం (వస్త్రం) ద్రష్టను దృశ్యాన్ని గూడ కలిగి ఉంటుంది. అది తేజోమయం.

సినిమాలో బొమ్మలు చీకట్లోగాని కనుపించవు. పగటి వెల్తురులో సినీ ప్రదర్శనం వీలేగాదు. అలాగే మనస్సు ఆలోచనలను ఆలోచించడం, విషయాలను చూడటం, అన్నీ ఆధారమైన అవిద్యవలనే. ఆత్మశుద్ధ జ్ఞానం, శుద్ధ తేజం. అందు ద్వైతం లేదు. ద్వైతం అంటే అజ్ఞానమే. ఆత్మజ్ఞానం, సాపేక్ష జ్ఞానాన్ని దాటినది. సామాన్యకాంతికి చీకట్లకు అవ్వలిది ఆత్మజ్యోతి. ఆత్మ ఏకైకము.

## భాషణములు 637

ప్రగతిని (progress) గూర్చి ఎవరో ప్రస్తావించారు.

శ్రీ భగవాన్ అన్నారు - ప్రగతి మనస్సుకు, ఆత్మకు కాదు, ఆత్మ సదా సంపూర్ణము.

## భాషణములు 638

కొన్ని రోజులుగా ఒక క్రొత్త నియమం విధించారు. మధ్యాహ్నం గం. 12.00 నుండి గం.2.30 ల దాకా ఎవరూ హాల్లోకి పోగూడదు. ఒకరోజు ముస్లిములు కొందరు భగవాన్ దర్శనానికై ఆ సమయానికే వచ్చారు. పరిచారకులు వారించారు, భగవాన్కు విశ్రాంతి భంగం కారాదని. శ్రీ భగవాన్ మాట్లాడకుండా సోఫా దిగి హాలు బయటికి వచ్చి హాలు గోడప్రక్కనే రాతిసేలపై కూర్చున్నారు. ఆగంతకులను దగ్గరగా వచ్చి కూర్చోండని చెప్పి, తాము వార్తాపత్రిక చదువుతూ ఆ రాతిసేలపైనే మేను వాల్చారు. ఆఖరుకు ఎలాగో వారిని ప్రార్థించి లోనికి రావించవలసి వచ్చింది.

## భాషణములు 639

పుదుక్కోట్టై కె. లక్ష్మణ శర్మతో మాట్లాడుతూ భగవాన్ అన్నారు చాలా పరిచితమూ, అత్యంత సన్నిహితమూ అయినది వదలి, ఎవరుగాని వేరే దానికై ఎందుకు తపన? “తత్త్వమసి" (అది నీవు) యని శ్రుతులన్నాయి. ఈ వాక్యంలోని 'త్వమ్' అనుభవసిద్ధం. దాన్ని వదలి వారు 'తత్'కై ప్రయత్నిస్తారు.

భక్తుడు: 'తత్' 'త్వమ్' ఏకమని కనుగొనడానికి.

మహర్షి: త్వమ్ అందరిలో వ్యాప్తమైన అంతరాత్మ. దాన్ని తెలుసుకోడానికి తన్ను వదలివేసి, ప్రపంచాన్ని విషయాశ్రితంగా చూస్తారు. ప్రపంచం ఏమిటి? దానిలో వ్యాప్తమేది? అది 'తత్', తన్ను తాను మరచినప్పుడే ఇతర భావనలు కలుగుతాయి. అట్టి విషయాలతో నేనే జోక్యమూ పెట్టుకోలేదు. కొంతకాలానికి ఇటువంటి విషయాలన్నీ మనుషులు పరిశోధిస్తారని నా మనస్సుకు వచ్చింది.

## భాషణములు 640

శ్రీ భగవాన్ శ్రద్ధగా ఏదో వ్రాసుకుంటున్నారు. సాయంత్రం నాలుగు గంటలయింది. వ్రాయడం ఆపి ఉత్తరపు కిటికీవైపు మెల్లగా చూపు మరల్చారు; ఫౌంటెన్పెన్ మూతవేసి దాన్ని ఒరలో ఉంచేసి, నోటుపుస్తకం మూసి ప్రక్కకు పెట్టారు. కంటి అద్దాలుతీసి ఒరలో పెట్టి ప్రక్కనే ఉంచారు. కొంచెం వెనుకకు వ్రాలి తలయెత్తి హాలుకప్పువైపు చూస్తూ, తలనిటూ అటూ త్రిప్పుతూ చూడనారంభించారు. చేతితో ముఖం రాచుకుంటూ, ఏదో యోచిస్తున్నట్లు కనిపించారు. హాలులో ఒకరివైపు తిరిగి, మెల్లగా అన్నారు "ఒక పిచుకలు జంట ఇప్పుడే ఇక్కడికి వచ్చి నాతో ఫిర్యాదు చేసాయి. వాటి గూడు సెవరో తీసివేసారట. నేను పైకి చూస్తే ఆ గూడు కనబడలేదు." తర్వాత పరిచారకుడు మాధవస్వామిని పిలిచి అడిగారు - "మాధవా, ఆ పావురాలు గూడు సెవరైనా తీసివేసారా?”

మాధవస్వామి తీరికగా లోపలికివస్తూ, తనకేమీ పట్టనట్లే అన్నాడు - "ఆ గూటి సెన్నిమార్లు కడితే అన్నిమార్లూ నేనే తీసివేస్తున్నాను. ఆ చివరిది ఈ మధ్యాహ్నమే తొలగించాను."

మ: అదీ సంగతి. అందుకే పిచుకలు మొరపెట్టాయి. పాపము! చిన్ని పక్షులు. వాని చిన్న ముక్కులతో గడ్డిపోచలూ, చినుగు పేలికలూ చేర్చి గూడుకట్టుకోడానికై ఎంత కష్టపడతాయో!...

మా: ఇక్కడే మన తలమీదే కట్టాలా ఏం?

మ: సరిసరి, చూస్తాంగా, చివరికెవరు సెగ్గుతారో? కొంచెం సేపటికి భగవాన్ హాలు వెలుపలికి వెళ్ళిపోయారు.

## భాషణములు 641

'సద్విద్య'లోని మొదటి పద్యాన్ని వివరిస్తూ అన్నారు -

“ప్రపంచం అందరికీ ఎప్పుడూ తెలిసేదే. "నేనూ, ఈ ప్రపంచమూ ఉన్నాము" అని అందరికీ తెలిసే ఉండాలి. కాని విచారిస్తే అవి యదార్థంగా ఉండేవేనా యని? అవి నిజములే అయితే, కాలదేశాలకు, వికారాలకు ఏ సంబంధమూ లేనివిగా ఉండాలి. అవి అట్లున్నవా? అవి జాగ్రత్ స్వప్నాల్లోనే గాని గాఢనిద్రలో గోచరించవు. అందుచే తామూ, ఈ ప్రపంచమూ, కొంత కాలమే ఉండి మాయమౌతూ ఉంటాయి. అవి సృజింపబడ్డవి, ఉండేవి, లయమయ్యేవి. వానిరాక ఎక్కడినుండి. ఉనికి ఎచ్చట, అదృశ్యమైపోయే దెక్కడికి? అటువంటి స్థితిని సత్యంగా తీసుకోగలమా?

అదీగాక నేను, ప్రపంచము, సృష్టివిషయములు, వాని ఉనికి నాశనము అన్నీ జాగ్రత్ స్వప్నాల్లోనే, నిద్రలో గావు. మిగత అవస్థలకూ సుషుప్తికీ భేదమేమి? నిద్రలో ఆలోచనలు లేవు; మిగత అవస్థల్లో ఉన్నాయి. కాబట్టి ఈ “నేనే"కు ప్రపంచానికి ఆలోచనలే మూలం.

మరి ఆలోచనల సంగతి ఏమిటి? అవి సహజాలు కావు. సహజాలయితే

ఒకప్పుడుండి మరొకప్పుడు మాయమవవు. అవి ఎక్కడినుండి వస్తాయి? ఆ మూలము ఏదో నిత్యస్థితము, అవికార్యమూ అని ఒప్పుకోవాలి. అది ఉపదేశ మంత్రంలో చెప్పిన నిత్యస్థితిగా ఉండాలి - దేనినుండి ప్రాణిసర్వమూ వెడలునో, దేనిలో ఉండునో, దేనిలో లీనమౌనో, ఆ స్థితి.

ఈ పద్యము స్తుతిగాని, పొగడ్తగాని కాదు. సత్యాన్ని ఉన్నదున్నట్లు చెప్పడమే.

## భాషణములు 642

కె.ఎల్. శర్మ అడిగారు: "స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే'. ఇంకొకటి- 'స్వాత్మతత్త్వానుసంధానం భక్తి రిత్యపరే జగుః' - ఈ రెంటిలో భేదమేమి? మహర్షి: ఆ మొదటిది విచారం. 'నేనెవరు'- కోహం? - అది జ్ఞానాన్ని సూచిస్తుంది. రెండవది ధ్యానము. 'నే నెక్కడనుండి?' - కుతోహం? ఇది జీవాత్మను సూచిస్తుంది. ఈ జీవాత్మ పరమాత్మను కోరుకుంటుంది.

## భాషణములు 643

ఆంధ్రులొకరు, పెద్దవారు, చదువుకొన్నవారు. అడిగారు –

కర్మ జ్ఞాన మార్గములు భిన్నాలూ, పరస్పర స్వతంత్రములా? కర్మమార్గము ప్రారంభ మాత్రమేనా? దానిని పూర్ణంగా అభ్యసించి ఆ తర్వాత లక్ష్యప్రాప్తికై జ్ఞానమార్గ మవలంబించాలా? కర్మమార్గం, కర్మాచరణను ప్రోత్సహిస్తూనే, కర్మ యందు అనాసక్తిని బోధిస్తుంది. జ్ఞానం త్యాగాన్ని విధిస్తుంది. త్యాగమంటే సరియైన అర్థమేమి? మార్గమేదైనా, అన్ని మతాలూ, మదమోహ లోభాదులను జయించాలని అంగీకరించాయి. అరిషడ్వర్గములకు దూరంగావటం త్యాగాన్ని సూచించదా? లేదా, త్యాగం జీవితంలో కర్మనివృత్తినే తెలుపునా? ఈ ప్రశ్నలు నాకు క్లిష్టంగా ఉన్నాయి. ఈ సంశయాలను తొలగింప వేడుతున్నాను.

మహర్షి: (చిరునవ్వు నవ్వుతూ) అంతా నీవే చెప్పేసావు. నీ ప్రశ్నలోనే సమాధానమూ ఉంది. కామాదులనుండి విముక్తి తప్పరాని నియమము. అది ఫలిస్తే, అంతా ఫలించినట్లే.

భక్తుడు: శ్రీ శంకరులు జ్ఞానమార్గాన్నే పొగడి, ప్రాతిపదికగా త్యాగాన్ని ప్రశంసించారు. కాని గీతలో స్పష్టంగా రెండు విధానములను, కర్మజ్ఞానములను చెప్పియున్నది. (లోకేస్మిన్ ద్వివిధానిష్ఠా ....)

మ: ఆచార్యులవారు గీతాభాష్యంలో ఆ వాక్యాన్నీ వ్యాఖ్యానించారు.

భ: గీత కర్మమార్గాన్నే నొక్కి చెప్పుతుంది. అర్జునుణ్ణి యుద్ధానికి ప్రోత్సహించడానికి, కృష్ణుడు కూడా తానే ఎన్ని మారులో పరాక్రమించి మార్గం చూపారు.

మ: గీత ప్రారంభమే 'నీవు దేహం కావు, అందువల్ల నీవు కర్తవు కావు' అని.

భ: దాని ఉద్దేశం ఏమి?

మ: తాను కర్తను అనే భావన లేకుండా కర్మలు చేయమని. అహంకారం లేకపోయినా కర్మాచరణ సాగనే సాగుతుంది. మానవునికీ వ్యక్తీకరణం ఏదో ప్రయోజనానికై జరిగింది. తాను కర్తననుకొన్నా, మానినా ఆ ప్రయోజనం సిద్ధిస్తుంది.

భ: అయితే కర్మయోగమేమి? అనాసక్తి కర్మయందా, కర్మఫలమందా?

మ: పని ఏదైనా, తాను కర్తనన్న భావం వర్జించటం కర్మయోగం. పనులు వాటంతట అవే జరుగుతాయి.

భ: అది కర్మఫలమందనాసక్తిగా భావించవచ్చా?

మ: కర్త ఉంటేనే ప్రశ్న. తాను కర్త ననుకోరాదనే మొదటినుంచీ చెప్పడం,

భః అంటే "కర్తృత్వ బుద్ధి రహిత కర్మ" నేను కర్తను అనే బుద్ధి లేకుండా చేసే కర్మను కర్మయోగం అంటారు.

మ: అవును, అదే.

భ: గీత మొదటినుంచీ చివరవరకు కర్మాచరణాన్నే శ్లాఘించింది.

మ: అవును, కర్తలేని కర్మను.

భ: అట్లయితే ఇల్లు విడిచి సన్యాసి జీవితం గడపాలా?

మ: ఇల్లు నీలో వుందా, ఇంటిలో నీవున్నావా?

భ: అది నా మనస్సులో వుంది.

మ: అయితే, నీ భౌతిక పరిసరాలను విడిచిన మాత్రాన ఏమౌతుంది?

భ: ఇప్పుడు తెలుస్తున్నది, కర్తృభావనలేని కర్మయే త్యాగము. జీవన్ముక్తునికి కర్మాచరణము లేదా?

మ: ఈ ప్రశ్నించే దెవరు? జీవన్ముక్తుడా, మరొకరా?

భ: జీవన్ముక్తుడు కాదు.

మ: జీవన్ముక్తి కలిగిన ఆపైన, అవసరమనుకుంటే, ఆ ప్రశ్న అడగవచ్చు. మనోవృత్తుల విడుదలను సైతం ముక్తియని ఒప్పుకొన్నారు. ముక్తుడు కర్మాచరణను గురించి ఆలోచిస్తాడా?

భ: అతడు కర్మను వదలినా, కర్మ అతన్ని వదలదు. అవునా?

మ: అతడు దేనితో తాదాత్మ్యం పొందుతాడని ఈ ప్రశ్న?

భ: అవును. ఇప్పుడు నాకు విశదమైంది. సంశయాలు తీరాయి.

## భాషణములు 644

ఒక జిల్లా ఉద్యోగి, ముస్లిమ్: అసలు పునర్జన్మ అవసరమేమిటి?

మహర్షి: మనం జన్మించామో లేదో తెలిస్తే, పునర్జన్మ విషయం చూడవచ్చు.

భ: అంటే ?

మ: మరొక పుట్టుక గూర్చి మాట్లాడుతున్నావే. ఇప్పుడసలు పుట్టావా, అని

భ: నిస్సంశయంగా, ఏకకణము (అమీబా) నుండి ఉత్తరోత్తరా

ఉచ్చములైన శరీరాలు పుడుతూ చివరిమెట్టుగా మానవుడు పరిణమించాడు.

శారీరక పరిణామంలో తుదిమెట్టు మానవ స్వరూపం. ఇంకా మరుజన్మెందుకు?

మ: ఈ పరిణామవాదానికి తుది సెవరు నిర్ణయిస్తారు?

భ: శరీరపరంగా ఇది పరాయణము (పర్ఫెక్ట్), ఒక ఆత్మవిషయంలో మాత్రం ఇంకాకొంత అభివృద్ధి కావలసిరావచ్చు. అదీ మృతి తర్వాత సంభవిస్తుంది.

మ: ఆ మనిషి ఎవరు? దేహమా, ఆత్మయా?

భ: రెంటి కలయిక.

మ: దేహం లేక నీ వుండవా?

భ: ఏమిటి మీరనడం? అది అసాధ్యం.

మ: గాఢనిద్రలో నీ స్థితియేమి?

భ: నిద్ర తాత్కాలిక మృతి. అప్పుడు నా కే ఎరుకాలేదు. కాబట్టి అప్పటి స్థితియేమో నేను చెప్పలేను.

మ: కాని నిద్రలో నీ వున్నావు. లేదా?

భ: నిద్రలో ఆత్మ దేహాన్ని విడిచి ఎక్కడికో పోతుంది. మేల్కొనబోయేప్పుడు మరలి వస్తుంది. అందుచేత అది తాత్కాలిక మృతి.

మ: మరణించినవాడెవడు? తాను చచ్చిపోయానని చెప్పటానికని తిరిగిరాడు. నిద్రించినవాడు మాత్రం తాను నిద్రించానని చెప్పుతాడు.

భ: ఆ మృతి తాత్కాలికం గనుక.

మ: మృతి తాత్కాలికమూ, బ్రదుకు తాత్కాలికమూ అయితే, ఇక యథార్థమని

దేన్ని అనడం?

భ: ప్రశ్న కర్థం తెలియలేదు.

మ: జీవన మరణాలు రెండూ తాత్కాలికాలైతే, తాత్కాలికం కానిది ఏదైనా ఉండాలి కదా? తాత్కాలికం కానిది సత్యం.

భ: సత్యమంటూ ఏదీ లేదు. అంతా తాత్కాలికమే. అంతా మాయే.

మ: మాయ దేనిపై కనిపిస్తుంది?

భ: మిమ్ము నేను చూస్తున్నాను. ఇదీ మాయయే.

మ: అంతా మాయయే అయితే ఏ ప్రశ్నగాని ఎలా వస్తుంది?

భ: పునర్జన్మ ఎందుకుండాలి?

మ: ఎవరికి?

భః పూర్ణమానవునికి,

మ: నీవు పూర్ణుడవైతే, పునర్జన్మ భీతి యెందుకు? అది అసంపూర్ణతను సూచిస్తుంది.

భ: నేను భయపడతానని కాదు. కాని మీరంటారే, నేను మళ్ళీ జన్మయెత్తవలెనని?

మ: ఎవరలా అన్నారు? ప్రశ్న వేస్తున్నది నువ్వు.

భ: నేననేదిది. మీరు పూర్ణులు, నేను పాపిని, పాపిని గనుక పూర్ణతకై మరల పుట్టక తప్పదు అని మీరంటారు.

మ: లేదు, నేనట్లు చెప్పనే లేదు. నిజానికి నేననేది, నీకసలు పుట్టుకే లేదు; కనుక చావూ లేదంటున్నాను.

భ: నేను పుట్టనే లేదంటారా?

మ: అవును. నీవు నీ దేహమంటున్నావు. కాబట్టే దాని పుట్టుచావుల గూర్చిన సందేహము. నీవు దేహం కాదు. నీకు పుట్టుకాలేదు, చావూ లేదు.

భ: మీరు పునర్జన్మ సిద్ధాంతం ఒప్పుకోరా?

మ: ఒప్పుకోను. అంతేకాదు. మళ్ళీ పుడతానన్న తికమక భావన తీసివేయవలెనంటాను. మరోమారు పుడతా ననుకొంటున్నది నీవు.

ఈ ప్రశ్న ఎవరికి తోచిందో చూడు. ప్రశ్నించేదెవరో తెలియకపోతే, ఆ ప్రశ్నలను ఎప్పటికీ తీర్చలేము.

భ: అది నా ప్రశ్నకు సమాధానం గాదు.

మ: నిజానికి అది నీ ప్రశ్నకే గాదు. నీ సంశయాలకన్నింటికీ జవాబు.

భ: అది అందరికీ తృప్తినీయదు.

మ: అందరి విషయం అటుంచు. నీ సంగతి నీవు చూసుకుంటే, వారి సంగతి వారు చూసుకుంటారు.

నిశ్శబ్దం నెలకొన్నది. కొన్ని నిముషాల కతడు వెళ్ళిపోయినాడు. ఈ సంవాదం అతనికి తృప్తికరం కానట్టే తోచింది. కొంతసేపటికి శ్రీభగవానన్నారు. ఈ సంవాదం వాని మనస్సులో మెదలుతుంటుంది. ఫలితమూ ఉంటుంది.

అతడు సత్యమొకటి ఉన్నదని ఒప్పుకోవడం లేదు. సరే అంతా అసత్యమే అని నిశ్చయించేదెవరు? ఈ నిర్ణయమూ అయథార్థమే అవుతుంది కదా.

పరిణామవాద వివరణము వ్యక్తిని ప్రస్తుతస్థితికి తీసుకువచ్చింది. వాని మనస్సులోనిది కాకుంటే మరెక్కడి దా వ్యాఖ్య?

మృతి తర్వాత ఆత్మపూర్ణత చెందవలె ననడం, ఆత్మ ఉంది అని ఒప్పుకోవలసి వస్తుంది కదా. కాబట్టి వ్యక్తి దేహం కాదు. అతడు ఆత్మయే.

శ్రీ భగవాన్ పరిణామ వాదాన్ని వివరించారు.

కలలో ఒకని కొక భవనం కనిపించింది. అది అకస్మాత్తుగా కనిపించింది. దాన్నెందరో పనివాళ్ళు ఒక్కొక్క ఇటుకగా ఎన్నేండ్లో శ్రమించి కట్టారని వాడనుకొన్నాడు. వాళ్ళు పనిచేస్తుండగా ఇతడు చూడలేదు. పరిణామవాద విషయం ఇట్టిదే. తన్ను మనిషిగా చూచాడు. కనుక తాను ఏకకణస్థితినుండి ఈ దశకు వృద్ధినందాననుకొంటాడు.

ఒక భక్తుడు: విశ్వాన్ని చూచి, కార్యంనుండి కారణాన్ని ఊహించటానికిది దృష్టాంతము (విశ్వం పశ్యతి కార్యకారణతయా).

మ: అవును. ఫలితంనుంచి కారణాన్ని చేరుకోటమే ఎప్పుడూ జరుగుతున్నది. ఆ కారణానికీ కారణం ఉండాలి. ఈ వాదం ముగియదు. ఫలితాన్ని కారణంతో ముడిపెట్టడానికి ఆలోచించవలసి వుంటుంది. చివరకాతడు తానెవరన్న ఆలోచనకు

చేరుకుంటాడు. తన్ను తాను తెలిసికొన్నప్పుడు వానికి పూర్ణశాంతి లభిస్తుంది. మానవుని పరిణామం ఈ పూర్ణతాప్రాప్తికే. ఆ ముస్లిం ఉద్యోగి మునిసిపల్ కమిషనర్ తో ఈ విషయమే ప్రసంగిస్తున్నాడని

ఒక భక్తుడా సాయంత్రం భగవాన్కు తెలిపాడు. శ్రీ భగవాన్ అన్నారు.

దేహమూ ఆత్మ కలిసి మానవుడైనాడని వాని వాదం. గాఢనిద్రలో వానిస్థితి యేమి అని నా ప్రశ్న, వ్యక్తి అక్కడే ఉన్నా, దేహాని కది తెలియదే.

భః నిద్ర తాత్కాలిక మృతి అంటున్నాడు అతడు.

మ: అవునట్లే యన్నాడు. కాని మృతికి 'తాత్కాలికం' జోడించాడు. లేకపోతే వ్యక్తి దేహంలో చేరుకొనే దెలాగ? కాని దేహాన్ని ఎట్లు కనుగొంటాడు? వాడు తిరిగి రాక తప్పదు. తిరిగి రావడానికిగాని, ఆ దేహం తనదే యని స్థాపించుకోవడానికి గాని ఆ వ్యక్తి ఉండవలసిందే కదా.

నిద్రలో దేహాన్ని ప్రాణం రక్షిస్తుందని శ్రుతులన్నవి. దేహం నేలపై పడియున్నప్పుడు పులియో తోడేలో దాన్ని తినేయవచ్చు. అలాంటి జంతువు ముందు వాసన చూసి లోపల ప్రాణం ఉంటే, శవాన్ని తినే విధంగా దీన్ని నమలి వెయ్యదు. గాఢనిద్రలో దేహాన్ని రక్షిస్తూ లోన ఎవరో ఉన్నందు కది యొక దృష్టాంతము.

పై విషయంలో సంబంధించినవి కొన్ని శ్రీ భగవాన్ వచించారు -

విద్యలన్నీ ఆత్మసాధనా మార్గంలో వ్యక్తిని నడిపించడానికే, శ్రుతులూ మతాలు అన్నీ అందుకేయని అందరికీ తెలుసు. వాని అన్నింటి అంతరార్థమేమి? గతాన్ని, భవిష్యత్తును గూర్చి అవియన్న వేవో వదలి వేయండి. అవన్నీ ఊహాగానాలు. ఇప్పటి ఉనికి ప్రతివాని అనుభవం లోనిదే. శుద్ధ సత్తును గుర్తించు. అందులోనే అన్ని వివాదాలకు, ప్రవచనాలకు స్వస్తి.

కాని మానవుని బుద్ధి ఆ మార్గంలో నడవదు. అతడంతర్ముఖుడు కావడం చాల అరుదు. గతాన్ని భవిష్యత్తుని వితర్కించడం మనస్సుకొక సరదా. అది ప్రస్తుతంలోకి చూడదు.

భ: ఆత్మ నన్వేషిస్తూ అంతర్ముఖి అయితే, తాను మునిగిపోవాలి గనుక. కాని బాహిరంగమైన పరిశోధన దాన్ని పోషించి జీవితాన్ని పొడిగిస్తుంది.

మ: అవును. అది అట్లే బుద్ధిని పదునుచేయటంలో ఒక ఉపయోగముంది ఆత్మసాధనామార్గం తెలియచేయడానికి. అందుకే దాన్ని వినియోగించాలి.

## భాషణములు 645

30 ఏండ్లు, చక్కగా ఉన్నాడు, మిత్రులతో హాలులోకి వచ్చాడు. ఉన్నట్టుండి ఆరంభించాడు.

"నేను - నేను" అనడం వలన గమ్యం చేరడానికి ఎవరికీ ఉపయోగపడదు. 'నేను'ను నిర్దేశించే దెట్లు?"

మహర్షి: దాన్ని లోపల కనుక్కోవాలి. అది ఒక్కరు మరొకరికి చూపేందుకు వస్తువు కాదు.

భక్తుడు: ఉపదేశం 'నేను'ను కనుగోడానికైతే, అది ఏమో చూపించి ఆ ఉపదేశాన్ని పూర్తి చెయ్యాలి.

మ: ఇక్కడ ఉపదేశం కేవలం మార్గనిర్దేశమే. దాని ననుసరించడం సాధకుని పని.

భ: సాధకు డజ్ఞాని, వానికి ఉపదేశం అవసరం.

మ: అందుకే వానిని సత్యం తెలుసుకొమ్మని చెప్పడం. భ: కాని అది చాలదు. 'నే'నేదో వానికి ప్రత్యేకించి చూపించాలి.

అతడు దుడుకుతనంతో మాట వినిపించుకోలేదు. భగవాన్ వానికి విశదంగా వివరించ యత్నించారు గాని వాడు మాటమాటకు అడ్డుతగిలాడు. చివరకు భగవానన్నారు – 'ఇది సాధకుడు ఉండవలసిన తీరుగాదు. వాని కెవరైనా వినయం నేర్పిననాడు, వాడు దారికి వస్తాడు, అంత దాకా రాడు.' ఇంతలో వేదపారాయణం మొదలయింది.

తరువాత మాటవరసగా ఆ సంవాద ప్రస్తావన వచ్చింది. శ్రీ భగవాన్ పలికారు

- "సాధకుడు విని అర్థం చేసుకోవాలి. నన్ను పరీక్షించడానికైతే వాని ఇష్టం, నేనేమో వాదించను." అతడు మళ్ళీ మొదలుపెట్టాడు- నన్ను మీరు సరిగ్గా అర్థం చేసుకోలేదు. 'నేనేదో తెలిసికోవాలనుకుంటున్నాను. అది నాకు చూపించాలి.

వాని మాటల్లో దౌష్ట్యమే కన్పించింది. ఇతరులు వానిని దారికి తే యత్నించారు. వాడు మరింత బిగిసాడు. ఆఖరుకు భగవాన్ వానితో అన్నారు - "వచ్చిన దారినే వెళ్ళిపో. అది అంతరంగానో, బాహిరంగానో నీకు వీలైనట్లు చేసుకో."

వానికావేశం వచ్చింది. ఇతరులకూ అలాగే కోపం వచ్చింది. ఎలాగో వానిని హాలు బయటికి పంపివేశారు. ఆ తరువాత తెలిసింది. అతడు యోగాభ్యాసం చేస్తాడనీ, ఇతర మార్గాలన్నింటినీ విమర్శించడమే వానిపనియనీ, జ్ఞానాన్నీ, జ్ఞానులను తిట్టి పోస్తాడట.

రాత్రి భోజనాల తర్వాత శ్రీ భగవాన్ శ్రీ గోవిందయోగి వృత్తాంతం తెలిపారు. ఆయన మలయాళి బ్రాహ్మణుడు, పండితుడని పేరుంది. ఆయన యోగాన్ని శ్లాఘించి, ఇతరములను తెగడేవాడు. ఆయన పద్ధతిని సమర్థిస్తూ ఎప్పుడూ గీతను ఉపనిషత్తులనూ ఉటంకించేవాడు. శ్రీ నారాయణ గురువులు, అవే శాస్త్రాలను ఉటంకించి వానిని ఖండించేవారు.

తరువాత శ్రీ భగవాన్ శ్రీ అమృతనాథుల శీలాన్ని ప్రశంసించేవారు. ఆయన గొప్ప తపస్వి. జపం ఎంతగానో చేసాడు. ఎన్నో తావుల ఎంతోమంది బీదల కన్నదానం చేసాడు. సర్.పి. రామనాథన్, పండిత్ మాలవ్యాలాంటి పెద్దలెందరికో ఆయన స్నేహపాత్రుడు.

## భాషణములు 646

11వ తేది 'హరిజన్' పత్రికలోని గాంధీజీ వ్యాసభాగాన్ని శ్రీ భగవాన్ పేర్కొన్నారు -

భగవంతుని చేత లెరుగరావు. నాయీ రాజ్కోట్ ప్రయాణంనాకే ఆశ్చర్యం గొల్పుతున్నది. నేనెందుకు పోతున్నాను, ఎక్కడికి, ఏమి సాధించను - వీని విషయం నేను యోచించనే లేదు. దైవమే మార్గదర్శి, నేనేమి యోచించాలి, ఎందుకు

యోచించాలి? ఆయన నడపుతున్నప్పుడు నా ఆలోచన సైతం ఆటంకం కావచ్చు. నిజానికి ఆలోచన మానడానికి పెద్ద యత్నమక్కరలేదు. ఆలోచనలు రావు. అలా అని ఏమీ లేదని కాదు. నాయీ గమ్యం గూర్చిన ఆలోచనే లేదు.

ఆ మాట లెంత యథార్థాలో శ్లాఘిస్తూ, భగవాన్ అందలి ప్రతివ్యాక్యాన్ని బలపరచి, ఆలోచనలు లేని స్థితిని తాయుమానవర్ రచన నొకటి వల్లించారు.

"నిశ్చల తత్త్వమానందము, ఆనంద సకలమని శ్రుతులన్నీ ఘోషిస్తాయని ఎన్నిమార్లు వింటేనేం, నేను మూర్ఖుడుగానే ఉండిపోయాను. ఆ అజ్ఞానం వలన నా ప్రభువు - మౌనగురు - బోధసైతం పాటించనే లేదు. మాయాటవిలో తిరుగులాడాను. ఎంత దురదృష్టమో! నా విధి అట్లున్నది."

"నిశ్చలంగా ఉండిపోతే, ఆనందం తానై వెల్లివిరుస్తుంది. మరి ఈ యోగాభ్యాస భ్రమ యెందుకు? బుద్ధిని ప్రత్యేకంగా ఒక దిక్కుగా మళ్ళిస్తే ఆనందం వ్యక్తమౌతుందా? ఔననకు. ఆ అభ్యాసంలోనే మునిగియున్న నీవు, వివరమెరుగని బిడ్డవు."

"నిత్యస్థితి నీవు మాయమయిన స్థితి. నీవు సైతం అందులో లేవా? పలుకులలో తెలుపలేని నీవు వ్యాకులపడకు. నీ వవ్యక్తుడేగాని, లేనివాడవు గావు. నీవు నిశ్చలుడవు, నిత్యుడవు. తాపమందక, ఆనందమిదిగో, రా, రా."

## భాషణములు 647

భక్తుడు: గాంధీజీ వర్ణించిన స్థితిలో ఆలోచనలు బయటివిగా అయిపోవా? మహర్షి: అవును. "నేను" ఆలోచన వచ్చాకే, ఇతర ఆలోచనలన్నీ. నీ ఉన్నావనుకున్న తర్వాతే ప్రపంచం కన్పించటం. తానన్న ఆలోచనలతోబాటు, ఇతర ఆలోచనలన్నీ ఆయనలో పోయాయి.

భ: అట్టిస్థితిలో దేహబుద్ధిగూడ ఉండదు కదా.

మ: దేహబుద్ధిగూడ ఒక ఆలోచనే. ఆయన వర్ణించిన స్థితిలో ఆలోచనలు రావు.

భ: ఆలోచనలు మానుటకు ఏ ప్రయత్నమూ అక్కరలేదన్నారు గాంధి.

మ: నిజమే. ఆలోచనలు నిలుపటానికి ప్రయత్నమక్కరలేదు. కాని ఆలోచనలు తెచ్చుకోవాలంటే ప్రయత్నం అవసరం.

భ: ప్రయత్నమంతా ఆలోచనలు ఆపటానికే. గాంధీజీగూడ దైవ సహాయానికి ఆలోచనలు అడ్డుమన్నారు. కాబట్టి అది సహజస్థితి. సహజమే అయినా, అది సిద్ధించడమెంత కష్టమో, సాధన లవసరమంటారు. సాధన లాటంకములంటారు. మాకిది సందిగ్ధంగా ఉంది.

మ: ఆ విషయం అనుభవంలోనికి రాని వానికి సాధనలు కావాలి. అవి ఆటంకాలు నివారించటానికి. సాధనలెన్ని చేసినా అవి ఆదుకోలేని స్థితి యొకటి వస్తుంది; తాను శ్రద్ధగా నెరపిన సాధననుగూడ సాగించలేని స్థితి. దైవశక్తి నప్పుడే గుర్తిస్తారు. ఆత్మ యప్పుడు తానుగా సాక్షాత్కరిస్తుంది.

భః స్థితి సహజమే అయితే, అసహజ విపరిణామాలనూ, దశలనూ తొలగించుకొని అదే తనంత తాను నిలబడాలి కదా.

మ: సహజస్థితి గాక మరేదైనా ఉందా? ఆత్మతోబాటు మరొకటిని గూడ ఎవరైనా చూసారా? ఆత్మను ఎప్పుడూ ఎరిగే ఉంటారు. కాబట్టి అది ఎప్పుడూ తానుగానే ఉంటుంది.

భ: అది స్వయంప్రకాశి గనుక తానై గోచరిస్తుందంటారు. అది ప్రదీప్తం గనుక ప్రత్యక్షమనుకుంటున్నాను. కాని అది మాకు తెలియడం లేదు, కనుక అది వెలుగలేదని భావిస్తాను. అది కేవలం ప్రదీప్తమే; దానిని ఎన్నో అడ్డగించి అది వాని మరుగున పడుతోంది. ఆత్మ ప్రకర్షణ దీప్తం (ఉజ్జ్వలంగా వెలిగేది) అయితే, ఇతరాలన్నిటినీ మిగిలి వెలుగవలె, కాబట్టి దాని కాంతి నధికంజేయు యత్నమవసరమని తోస్తున్నది.

మ: అది ఎలా సాధ్యం? ఆత్మ ఒక మారు మందకొడిగా, మరొకమారుజ్జ్వలంగా ఉండదు. అది ఏ మార్పూలేక ఒకేరీతిగా ఉంటుంది.

భ: శిఖిధ్వజునితో చూడాల తాను వత్తిని సరిదిద్దానంతే అంటుంది.

మ: అది నిదిధ్యాసన విషయం.

శ్రవణంవల్ల జ్ఞానోదయం - అది జ్వాల

మననం కలిగిన జ్ఞానాన్ని మరవనీయదు. గాలి కడ్డుగా కట్టిన తెర దీపాన్ని ఆరకుండ నిలిపేట్లు. పొంగే ఇతర ఆలోచనల్లో సుజ్ఞానాన్ని మునుగనీక ఆపుతుంది.

నిదిధ్యాసన - జ్వాలప్రదీప్తంగా ఉండేట్లు వత్తిని సరిచేస్తుంది.

ఇతర ఆలోచనలు వచ్చినప్పుడెల్ల సత్యజ్ఞాన కాంతి దానిపై ప్రసరించేట్లు

మనసును అంతర్ముఖం చేస్తుంది.

అది స్వభావమైనప్పుడు సమాధి.

"నే నెవర"న్న విచారము శ్రవణం.

'నేను' స్వరూప నిర్ణయము మననము.

ప్రతి పరిస్థితిలోనూ దాని ఆచరణ, నిది ధ్యాసనము.

"నేను"గా ఉనికి సమాధి.

భ: దీని నెన్నిమారులో విన్నాము. అయినా ఈ బోధను ఆచరణలో పెట్టడం సాధ్యం కావడంలేదు. దీనికి నా మనోదౌర్బల్యమే కారణం అయివుండాలి. వయస్సు గూడ కారణం కావచ్చునా?

మ: తీవ్రాలోచన మనోదార్ఢ్యలక్షణమని సాధారణంగా నమ్ముతారు. కాని ఇచ్చట ఆలోచనలెంత తగ్గితే మనస్సంత దృఢంగా గణిస్తారు. 30 ఏండ్లు లోపుగను ఆత్మసిద్ధియంటారు యోగులు; కాని జ్ఞానులది ఒప్పుకోరు. వయస్సుతో జ్ఞానం పోదు.

యోగవాసిష్టం వైరాగ్య ప్రకరణంలో వసిష్ఠులు రామునితో 'కౌమరంలోనే నీకింత వైరాగ్యం ఉండటం అభినందనీయం' అన్నారు. నిజమే. కాని వార్ధక్యంలో జ్ఞానం కలుగదని ఆయన అనలేదు. వృద్ధ వయస్సులో జ్ఞానాన్ని అడ్డేదేమీ లేదు. సాధకుడు ఆత్మగా ఉండాలి. అది చేతకాదా, "నేను" పదానికి సునిశ్చితార్థం తెలిసికో యత్నించాలి. ఇతర ఆలోచనలు వచ్చినప్పుడెల్ల ఆ నిశ్చితార్థం వైపు మరలాలి. అది అభ్యాసం.

ప్రపంచ భావన మనస్సు నెప్పుడూ చెదరచేస్తుంది గనుక, 'తత్'ను తెలియడ మవసరమని కొందరు అంటారు. దాని నిజం విచారిస్తే అది బ్రహ్మమని తెలుస్తుంది. 'త్వమ్' అర్థమయ్యేది తర్వాత. అది జీవుడు. అంతంలో జీవబ్రహ్మైక్య మవుతుంది. ఇంతకూ ఇదంతా ఎందుకు? ఆత్మకు వేరుగా ప్రపంచమున్నదా? "నేను" ఎప్పుడూ బ్రహ్మమే. అది సిద్ధాంతీకరించడానికై ఏ అభ్యాసమూ, తర్కమూ అక్కరలేదు. ఆత్మ సాధిస్తే చాలు, అది సదా బ్రహ్మమే.

వేరే పక్షం వారికి నిదిధ్యాసనము. 'అహం బ్రహ్మాస్మి'యన్న భావనే. అది బ్రహ్మమువైపు బుద్ధి మరల్చటం. వేరే విధంగా బుద్ధి చలించకూడదు. అంతటితో కథ ముగింపు.

ఆత్మ నెరుగుటకే దీర్ఘ ప్రణాళిక లక్కరలేదు. దానిని మరొకరా చూపాలా? తానున్నానని ఎవరికి తెలియదు? చిమ్మచీకటిలో తన చేతినే కనలేనప్పుడు గూడ, ఎవరైన పిలిస్తే 'నేనిక్కడున్నా'ననడా?

భ: కాని ఆ బదులు పలికేది, ఎరుకయే తానైన పరమాత్మ కాదు; అది

అహంకారము లేదా "నేను" అనే ఆలోచన. మ: వెలుతురు, చూపు ఇట్టివి లేనప్పుడు అహంకారంగూడ తన్ను తానెరుగ గలదు. ఇక శుద్ధ తేజమైన ఆత్మకా తెలియనిది?

ఆత్మస్స్వయంసిద్ధం. దానిని తెలియడానికి తత్త్వములు, తర్కములు పనిలేదు. తత్త్వము లిరుపై నాల్గని కొందరు; అంత కెక్కువని మరికొందరు అంటారు. ఆత్మ ఉన్నదని ఒప్పుకోటానికి ముందు ఇన్ని తత్త్వాలనూ తెలిసికోవాలా? శాస్త్రములు వానిని విపులంగా చర్చించాయి. ఉద్దేశం, అవేవీ ఏ విధంగానూ ఆత్మను అంటవు అనడానికే తత్త్వాలేవీ తెలియకనే సాధకుడు సూటిగా ఆత్మ సంగీకరించి అది తానయ్యేందుకు యత్నించవచ్చు.

భ: గాంధీజీ చిరకాలం సత్యదీక్ష పాటించి ఆత్మను సాధించారు.

మ: సత్యం, ఆత్మ కాక మరేమి? 'సత్' అయినది సత్యము. సత్యం ఆత్మ కన్యంగాదు. కాబట్టి గాంధీజీ సత్యం కేవల మాత్మయే.

ప్రతివాడూ తన్నుదెలిసికూడా అజ్ఞానియే. మహావాక్య శ్రవణంవల్లనే వాడు తన్నుతాను తెలుసుకుంటాడు. అందుచేతనే ఉపనిషత్ గ్రంథము నిత్యసత్యము. ఆత్మజ్ఞాని ప్రతివాడూ తాను పొందిన అనుభవం ఉపనిషత్లో చెప్పబడిందే. ఆత్మయే బ్రహ్మమని విన్న తర్వాత స్వస్వరూపం సరిగా అర్థమవుతుంది. విక్షేపం కలిగినప్పుడెల్ల దానికై మరలుతాడు. ఆత్మ సాధనా ప్రణాళిక సర్వమూ ఇదే.

## భాషణములు 648

తత్త్వరాయర్ వృత్తాంతమును శ్రీభగవాన్ తెల్పారు - తమిళంలో అద్వైత తత్త్వాన్ని ప్రప్రథమంగా గుప్పించి నాతడు తత్త్వరాయర్, వారు 'భూతలమే శయనం, కరములే భోజన పాత్రలు, కౌపీనమే దుకూలం, తనకు లేమియే లేదన్నారు.

'మహారాజ తురవు' (రాజు యొక్క సన్న్యాసము) లో వారన్నారు - "వట్టి నేలపై అతడు కూర్చున్నాడు. ధరణి అతని పీఠము; వాయువు చామరము, ఆకాశమే ఛత్రము. త్యాగము, భార్య."

శ్రీ భగవాన్ వచించారు - 'ఆ తొలిరోజుల్లో నేలపై ఏ గుడ్డా పరచుకో లేదు. నేలపై కూర్చొనేవాణ్ణి. అక్కడే నిద్రించేవాణ్ణి. స్వేచ్ఛయంటే అదే. సోఫా ఒక సంకెల. ఇది నాకు చెరసాల. నా ఇష్టం వచ్చినచోట నా ఇష్టం వచ్చినట్లు వీరు కూర్చోనీయరు. ఇది బంధం గాదూ! ఎవని ఇష్టమైనట్లు వాడుచరించే స్వాతంత్ర్యం ఉండాలి. వానికే పరిచారకులూ ఉండకూడదు.

"కోరికలు లేకపోవడంకంటే బ్రహ్మానంద ముందా? అనుభవించిన వారికే అది తెలుసు. కోరికలు లేనివారితో ఏ చక్రవర్తి దీటురాడు. చక్రవర్తికి లోబడి సామంతులుంటారు. కాని ఇతనికో, ఆత్మ కన్యమే లేదు. ఏది మిన్న?

## భాషణములు 649

శ్రీ థాంప్సన్ కొన్నేండ్లుగ ఇండియాలో ఉన్నాడు. హిందూ వేదాంతము చదువుతున్నాడు. శ్రద్ధాళువైన విద్యార్థి. నెమ్మది స్వభావము. అతడడిగాడు: శ్రీమద్భగవద్గీతలో "బ్రహ్మమున కాధారము నేను' అని ఒకచోట, మరొకచోట, 'ప్రతివాని హృదయంలో నేనున్నాను' అని పరతత్త్వాన్ని వేర్వేరుగ వివరించియుంది. అందు మూడవస్థలు (1) అతీత, 2) అంతర్యామి, 3) విశ్వరూప మని కనిపిస్తాయి. ఎరుక ఈ మూడింటిలోనూ కావలెనా ఏ ఒక్కటి లోనైనా చాలునా? విశ్వరూపము నుండి అతీతానికి వస్తే వేదాంతం నామరూపాలను మాయయని త్రోసిపుచ్చుతుంది. దీనిని నే నొప్పుకోలేను. చెట్టు అంటే స్కంధము, శాఖలు రెమ్మలు ఆకులూ అన్నీ కలిసే ఆకులు మాయయని ఉపేక్షించలేను. స్వర్ణం - స్వర్ణాభరణం దృష్టాంత రీతిగా అంతా బ్రహ్మమే నంటుంది వేదాంతం. నిజం అర్థం చేసికొనెదెలా?

మహర్షి: గీతలో 'బ్రహ్మణో హి ప్రతిష్ఠోహం' అని ఉంది. ఆ 'అహం' అర్థమయితే

అంతా తెలుస్తుంది.

భ: అది అంతర్యామి దశవరకే.

మ: నీవు వ్యక్తివనీ, నీ చుట్టూ విశ్వమనీ, దానికవ్వల దైవమనీ ఇప్పుడనుకొంటున్నావు. ఈ మూడూ వేరనే భావము అందులో ఉంది. ఈ వేరు అనే భావన పోవాలి. దైవము జగము నీకు వేరుగావు.

గీత ఏమన్నదో చూడు - "ఓయీ అర్జునా! సర్వభూతముల హృదయములందునూ నే నంతరాత్మను. వాని కాదిమధ్యాంతములను నేనే. సర్వభూతముల హృదయములందు దైవముండుటే గాదు. అదే వాని యన్నింటికినీ మూలము, స్థితి. అంతముకూడ, వానినుండే అన్నీ పుడతాయి. ఉంటాయి. చివరకు లీనమౌతాయి. కాబట్టి దైవం వేరుకాదు. (భ.గీ. 10 అ. 20శ్లో )

భ: 'విశ్వసకలమూ నాలో అణుమాత్రమే' అన్న గీతావాక్యాన్ని అర్థం చేసుకోవడం ఎలా?

మ: దైవం నుంచి ఒక అణువు వేరై ఈ విశ్వమైనదని కాదు దానియర్థం. అతని శక్తి ప్రవర్తిల్లుతున్నది. ఆ చైతన్యంలో ఒక ఘట్టంగా ఈ విశ్వం వ్యక్తమయింది. అలాగే పురుషసూక్తవాక్యం "పాదోస్య విశ్వాభూతాని" అన్ని భూతములునూ అతని పాదము, బ్రహ్మకు నాల్గు కాళ్ళని కాదు.

భ: నాకది తెలుస్తూనే ఉంది. బ్రహ్మము అవిభాజ్యము.

మ: అంటే బ్రహ్మ సర్వమూ అవుతూనే అవిభాజ్యముగా నున్నాడని, అతడు ఎప్పుడూ పొందబడిన వాడై ఉన్నాడు. మానవుడది ఎరుగడు. అది తెలుసుకోవాలి. బ్రహ్మమంటే ఆత్మ, నిత్యసత్యం, దానియెరుక నడ్డేవాని యన్నింటి నిర్మూలనమే జ్ఞానం. వ్యక్తి వేరన్న భావము అట్టి ఆటంకముల కూటమి. కాబట్టి ఆత్మ బ్రహ్మ కన్యం గాదన్న యథార్థం తెలియటమే నీ ఇప్పటి ప్రయత్నముల ఫలం.

## భాషణములు 650

ఒక ఆంధ్రుడు, నడివయసువాడు. జపమెట్లు చేయవలెనని భగవాన్ను అడిగాడు.

మహర్షి: జపంలో నమః అనే పదం వస్తుంది. అంటే మనస్సు ఆత్మ కన్యంగా వ్యక్తం కానిస్థితి. ఆ స్థితికి చేరుకోవటంతో జపం ముగుస్తుంది. అంతలో కర్తా, వానితో బాటు చేష్ట రెండూ తిరోధానమౌతాయి. నిత్యుడొక్కడే మిగులుతాడు. ఆ స్థితి అందేదాక జపం చేయాలి. ఆత్మనుండి విడివడనే లేము. కర్త ప్రయత్నం లేకనే ఆత్మ వానిని తనలోనికి లాగేస్తుంది. ఒక్కమారట్లయితే, ఇంక అతడు చేయవలసిందేమీ లేదు. ఆత్మలో లీనమై యుండవలసిందే.

భక్తుడు: భక్తి, ముక్తికి దారితీస్తుందా?

మహర్షి: అవి రెండూ వేరుగావు. భక్తి ఆత్మగా ఉండటం, అంటే స్వరూప స్థితి. ఎవనికైనా అసలు స్థితి అదే. వాని సాధనల చేత అందు చేరుతాడు. భక్తియేమి? దైవస్మరణ. అంటే ఇతర ఆలోచనలన్నీ పోయి ఒకే ఆలోచన నిలవడం. ఆ ఒక్క తలపూ దైవమైతే, తన్ను దైవాని కర్పించుకొన్నాడని, దైవము నిన్ను చేపట్టినా, నీ కెదురులేదు. ఆలోచనలు లేకపోవడమే భక్తి, అదే ముక్తి.

జ్ఞానమార్గానికి విచారము అని కూడా చెప్పారు. ఇది పరాభక్తియే, మాటలు మాత్రమే వేరు.

భక్తియంటే పరమాత్మ ధ్యాన మనుకుంటావు. విభక్తి (వేరన్న ఆలోచన) ఉంటేనే భక్తి చేయటం. ఆ మార్గం నిన్ను పరగమ్యం చేరుస్తుందని గీతలో ఉంది.

"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ, తేషాం జ్ఞానిః నిత్యయుక్తా ఏకభక్తి ర్విశిష్యతే" (భ.గీ. 7: 16,17)

ధ్యాన మేదైనా మంచిదే. వేరన్న భావన నశించి ధ్యేయమేమీ లేక ధ్యాత తెలియదగినది మరేదీలేక. ఒంటియై మిగిలితే, అదే జ్ఞానము. జ్ఞానాన్ని ఏకభక్తి
అన్నారు. జ్ఞానియే పరముడు. అతడాత్మగానే నిలిచాడు, ఆ పైన చేయుట కేమీ లేదు. అతడు పూర్ణుడు, భయరహితుడు. "ద్వితీయాత్ వై భయం భవతి" (రెండవది ఉంటేనే భయం) అదే ముక్తి, అదే భక్తి.

## భాషణములు 651

కైవల్య నవనీత తమిళావృత్తికి ఆంగ్లానువాదాన్ని చూచి వ్రాస్తున్నాడు, ఎ.డబ్ల్యూ. చాడ్విక్ కొన్ని పారిభాషిక పదాలు, కొన్ని ఘట్టాలు తెలియనివి వచ్చినప్పుడు శ్రీ భగవాన్ నడిగి తెలుసుకుంటున్నాడు. శ్రీ భగవాన్ అన్నారు. "ఆ భాగాలు సృష్టివాదాల గూర్చినవి. శ్రుతులు వానిని ప్రతిపాదించదలచలేదు. కనుక ఆ వాదాలను మనము పట్టించుకో నక్కర లేదు.. వాని నవి యాదృచ్ఛికంగా చెప్పాయి. సాధకుని మనస్సటు మ్రొగ్గితే తృప్తిపడనీయలే యని. నిజానికి ప్రపంచం కాంతి ప్రవాహంలో కదిలే ఛాయలాంటిది. ఆ నీడను చూడడానికి కాంతి కావాలి. ఛాయ, ప్రత్యేక పరిశీలనకూ తర్కవాదాలకూ తగ్గదిగూడ కాదు. ఆత్మవివరణమే శ్రుతి యుద్దేశము. సృష్టిని గూర్చిన వాదోపవాదాలు ప్రస్తుతం వదిలేయవచ్చు. తర్వాత భగవాన్ మళ్ళీ వివరించారు- వేదాంతంలో దృష్టితోనే సృష్టియని ఉంది. సృష్టి క్రమాన్ని విశేషాంశాలతో వివరించ లేదు. దీన్ని యుగపత్ సృష్టి (తక్షణసృష్టి) యన్నారు. ఇది స్వప్నంలో విషయములూ విషయి ఏకకాలంలో కల్పితాలైనట్లు. ఇట్లంటే కొంతమంది ఒప్పుకోరు. విషయజ్ఞానంలో వారినిష్ఠ అట్టిది. హఠాత్ సృష్టి అసంభవం. ప్రతికార్యానికి పూర్వం కారణమంటూ ఉండవలెనని వారి వాదం. క్లుప్తంగా చెప్పాలంటే తమ చుట్టూ వున్నా ప్రపంచం ఎట్లు కలిగిందో తెలియవలెనని వారి కుతూహలం. అట్టివారి ఉత్సాహాన్ని తృప్తిపరచడానికి శృతి వివిధమైన సృష్టివాదాలను చెప్పాయి. సృష్టి విషయంలో ఈ పరిశీలనా పద్ధతిని క్రమసృష్టి యన్నారు కాని సరియైన సాధకునికి యుగవత్ సృష్టియే తృప్తికరము.

## భాషణములు 652

శ్రీ భగవానన్ను స్తుతిస్తూ ఒకరు పద్యాలు వ్రాశారు. అందులో ఆవర్తపురి (తిరుచ్చుళి) ప్రశంస ఉంది. శ్రీభగవాన్ జన్మించిందా ఊరిలోనే. ఆ ఊరికి చాలపేర్లు, ఆవర్తచుళి అంటే సుడి లేదా సుడిగుండం. జరిగిన ప్రళయములెన్నో, అందులో మూడింటినుండి శివుడే ఈ ప్రదేశాన్ని రక్షించాడు. ఒకమారు భూమి అంతా జలమగ్నం కాగా, ఆ ప్రదేశమును శివుడు తన శూలాన్ని గ్రుచ్చి పట్టాడు. భూమినంతా ముంచేస్తున్న నీరు ఆ శూలం చివరలో వచ్చి పడనారంభించింది. అక్కడ ఒక సుడి ఏర్పడింది. అందువల్ల ఆ ఊరికా పేరు. మరొక ప్రళయంలో శివుడా ఊరిని తన త్రిశూలం చివర నిలిపాడు. అందుచేత అది శూలపూరి అయింది.

హిరణ్యాక్షుడు భూమిని నీటిలోనికి తీసుకుపోయాడు. విష్ణు వామె నుద్ధరించాడు గాని ఆమెకు రాక్షసుని పాపస్పర్శ సోకింది. ఆ కాలుష్యం కడిగివేయడానికై ఆమె శివుని ఆ ప్రదేశంలో పూజించింది. అందువల్ల ఆ ఊరు 'భూమినాథేశ్వరక్షేత్ర'మయింది.

అరుణాచలంలోను, తిరుచ్చుళిలోను గౌతమఋషి ప్రముఖులు. శివుడాయనకు తాండవమూర్తిగా దర్శనమిచ్చి ఆయనకై గౌరీశంకర వివాహాన్ని తిరిగి ప్రదర్శించాడు.

కౌండిన్యులా క్షేత్రంలో ప్రసిద్ధులు. ఆ ఋషికొరకే ఆ యూరి దగ్గర నది ప్రవహించింది. అదే 'కౌండిన్య'నది. తమిళ అపభ్రంశం 'కుండారు'. దానిని 'పాపహరి' (పాపములను పోగొట్టేది) అని గూడ పిలుస్తారు. అదొక గాథ. ఒక రాజు కూతురు. ఆమె పిచ్చి పట్టినట్టు ఉండేది. ఆమె నెన్నో తీర్థయాత్రలు చేయించారు. ఒక తీర్థంలో స్నానమాడబోతూ

ముందు చెప్పుకొన్న సంకల్పంలో 'పాపహారి' అని పేరు వినబడింది. ఆ తీర్థమెక్కడని విచారించి వారు తిరుచ్చుళికి వచ్చారు. అందు మునగగానే ఆమె ఆరోగ్యం సరిపోయింది.

ఈ చోటనే పాండ్యరాజు బ్రహ్మహత్యా పాతకము పోగొట్టుకున్నాడు. అది పాండ్యరాజ్యమధ్యంలో ఉంది. మధుర, రామ్నాడు, తిరునెల్వేలి జిల్లాలు నాటి పాండ్యరాజ్యము.

ఆ గ్రామంలో గుడియెదుట పుణ్యసరస్సు, శివుని శూలక్షతం వల్ల కలిగింది. ఇప్పటికీ తమిళనెల 'మాసి' (మాఘ) పూర్ణిమకు ముందు ఆ సరస్సులో రోజుకొక్కొక్క అడుగుగా నీరు నిండుతుంది. పున్నమి తర్వాత పది రోజులు వరుసగా ఒక్కొక్క అడుగే తగ్గిపోతుంది. ఈ వింత ప్రతి సంవత్సరమూ జరుగుతున్నదే. ఆ గ్రామంలోని పిల్లలంతా ఈ వింతను విడ్డూరంగా చూస్తారు. ఆ పున్నమికు స్నానానికై యాత్రికులు గుంపులు గుంపులుగా అక్కడికి చేరుతారు. ఆ నీటిలో గంధకం ఉంది. స్నానమాడిన యాత్రికుల వెండినగలు నల్లబడటం శ్రీ భగవాన్ కూడ తమ పిన్ననాట చూచి ఉన్నానని చెప్పారు.

ఆ గ్రామానికి ఒక వైపు నది, మరో వైపు పెద్ద చెరువు. బంకమన్ను గట్టు ఆ చెరువు చుట్టూ మూడు మైళ్ళ పొడవుంది. వింతయేమంటే గ్రామతలానికి ఆ గట్టు 20 అడుగుల ఎత్తున ఉంది. చెరువు పొంగినా, నీరు వేరు త్రోవల పొరలిపోతుందేగాని గ్రామాన్ని ఏ విధంగానూ బాధించదు.

## భాషణములు 653

తిరువణ్ణామలై ఊరిలో టీచర్ గిల్టు సభ. దానికి వచ్చిన ఉపాధ్యాయులు

కొందరు శ్రీ భగవాన్ దర్శనానికై హాలులోకి వచ్చారు. అందులో ఒకరన్నారు. 'నాకు దారి తెలియడం లేదు. అడవిలో తిరుగాడుతున్నట్లుంది.'

మహర్షి: అడవిలో ఉన్నానన్న భావన వదలాలి. అట్టి భావనలే ఇబ్బందులకు మూలం.

భక్తుడు: కాని నాకు దారి కనబడడం లేదు.

మహర్షి: ఆ దారిగాని, అడవిగాని, నీలోననేగాక మరెక్కడున్నాయి? నీవు ఉన్నచోటనే ఉన్నావు. అడవులూ, దారులూ అంటూ మాట్లాడుతావు.

భ: నాకు సంఘంలో మెదలక తప్పదు.

మ: అడవిలాగ ఈ సంఘమూ నీ భావనే.

భ: ఇల్లువిడిచి సంఘంలో పడి తిరుగుతున్నాను.

మ: అలా ఎవరు చేస్తున్నారు?

భ: దేహము కదులుతుంది, సర్వమూ అదే చేస్తున్నది.

మ: నిజమదే. నిన్ను దేహంతో తాదాత్మ్యం చేసుకొంటున్నావు. అందుకే ఈ క్లేశాలన్నీ, ఈ కష్టం నీ మనస్సులోనిది. దేహం నీవనీ, మనస్సు నీవనీ భావిస్తున్నావు. కాని ఆ రెంటినుంచి ముక్తుడవై ఉండే తరుణాలున్నవి. ఉదా- గాఢనిద్రలో,

కలలో ఒక జగత్తును దేహాన్ని కల్పిస్తావు. అది నీ మనోవృత్తులను సూచిస్తుంది. మెలకువలో నిన్ను నీ దేహమనుకొని 'అడవులలో,' ఇత్యాది భావనలను పెంచుకొంటావు.

అసలు స్థితి చూడు. ఈ మూడవస్థలూ మాటిమాటికీ మారుతుండేవి. కనుక నశించేవి. ఈ మూడవస్థల్లోనూ మార్పులేక నిరతము నీవున్నావు. కాబట్టి ఈ క్షణిక విషయాలన్నీ కల్పితాలు, సినీతెరపై పాత్రలవలె. నీపై కనబడి తిరిగి మాయమైపోయేవి. పాత్ర కదలినపుడు సినీతెర కదలదు. అలాగే, దేహము ఇల్లువిడిచి, సంఘంలో కలిసి తిరిగేటప్పుడు కూడ నీవు మాత్రం ఎక్కడ ఉన్నావో అక్కడే ఉన్నావు..

నీ దేహమూ, సంఘమూ, అడవి, దానిలోని బాటలూ, అన్నీ నీలోనివి, నీవు వానిలో లేవు. దేహం సైతం నీవే, కాని నీవు ఈ దేహమాత్రమే గావు. శుద్ధాత్మగా నీవు నిశ్చలంగా ఉంటే దేహమూ దాని చలనాలూ నిన్ను ఏమీ చెయ్యలేవు.

భ: అది గురువనుగ్రహ ముంటేనే సాధ్యమవుతుంది. నేను భాగవతం చదువుతున్నాను. బ్రహ్మానందము లభించటం కేవలం గురు పాదధూళి చేతనే అని ఉంది. అనుగ్రహాన్ని వేడుతున్నాను.

మ: ఆనందము నీ ఉనికి గాక మరేమి? నీవు నీ వునికికి భిన్నంగా లేవు. ఆ ఉనికి ఆనందం ఒకటే. నీవు దేహమనీ, మనస్సనీ అనుకుంటున్నావు. అవి మార్పుచెందేవి, నిలుకడ లేనివి. నీవో, నిత్యుడవు, అవికారుడవు. ఈ విషయం నీకు తెలియాలి.

భ: నాకిది తెలీదు, నేనజ్ఞానిని,

మ: ఈ అజ్ఞానం పోవాలి. అదీగాక 'నే నజ్ఞాని'ననే దెవరు? వాడు అజ్ఞానానికి సాక్షి కావాలి. ఆ సాక్షి నీవు. 'నాకు తెలియదని, నాకు తెలుసు'నన్నాడు సోక్రటీస్. అది అజ్ఞానమెలా అవుతుంది? అది జ్ఞానమే.

భ: అలాగైతే వేలూరులో నుండగా అశాంతి, తమ సన్నిధిలో ఇంత శాంతి నాకెలా లభిస్తున్నవి?

మ: ఈచోట నీ యొక్క భావాన్ని ఆనందం అనగలమా? ఇక్కడినుండి వెళ్ళి పోయేక ఇక్కడ కూడా ఆనందం లేదని అంటావు. కాబట్టి ఈ శాంతి శాశ్వతం కాదు. నిజానికి మరొక స్థలంలో కలిగే అశాంతితో ఇది మిశ్రమైపోయింది. కాబట్టి కాలదేశాలు శాంతి నివ్వవు. ఉపయోగపడాలంటే శాంతి నిత్యంగా ఉండాలి. ఆ నిత్యస్థితుడవు నీవే. ఆత్మనిష్ఠుడవు కా. ఆనందమదే; నీ వెప్పుడూ అదే.

వేలూరు వదలి, రైలులో పయనించి, తిరువణ్ణామలై చేరి, ఈ హాలులో ప్రవేశించి, ఆపై ఆనందం దొరికిందంటున్నావు. వేలూరికి తిరిగివెళ్ళితే మళ్ళీ దుఃఖమే. ఒకచోటినుండి మరొక చోటికి నీవు నిజంగా వెడుతున్నావా? నీవు దేహమే అనుకున్నా, ఆ దేహము ఇంటివాకిటనున్న బండిలో కూర్చున్నది. బండి కదలి రైల్వే స్టేషన్ చేరింది. అంతట ఆ దేహం రైలు పెట్టెలో ఎక్కింది. ఆ రైలు సత్వరం వేలూరునుండి తిరువణ్ణామలైకు చేరింది. అక్కడ ఈ దేహం మరొక బండిలో ఎక్కింది. ఆ బండి దాన్నిక్కడికి తెచ్చింది. అయినా నిన్నెవరైనా అడిగితే వేలూరునుండి ఇంత దూరము నీవు వచ్చానంటావు. నీ దేహం ఉన్నచోటనే ఉంది. స్థలాలన్నీ దాని ప్రక్కనే కదలిపోయినవి.

నీ ఈ భావనల కారణం మిథ్యాసమన్వయం. అవి అంత లోతుగా పాతుకొని పోయాయి.

మరొకరు: ప్రపంచ మనిత్యమని అర్థం చేసుకోవాలా?

మహర్షి: ఏల? దానిని నీ విప్పుడు నిత్యమనుకొంటున్నావు. గనుక. మిథ్యనుంచి నిన్ను తప్పించడానికై శ్రుతులు ఈ ప్రపంచం అనిత్యమని ఘోషిస్తున్నాయి. అదిఅర్థం కావాలంటే, నీవు నిత్యుడవని నీవే తెలుసుకోవాలి, ప్రపంచ మనిత్యమని దూషించికాదు.

భ: ఉదాసీనతను అభ్యాసం చెయ్యమన్నారు. ప్రపంచ మసత్యమయితేనే అది సాధ్యం కదా.

మ: అవును. "ఔదాసీన్య మభీప్స్యతాం" (ఉదాసీన భావం అభిలషింపతగ్గది) కాని అది ఏంటి? ప్రేమద్వేషాలు లేకుండటం. ఈ కల్పనలన్నీ ఆత్మపై కదలిపోయేవే. ఆత్మయే నీవైనప్పుడు, వాని ఎడల నీకు ప్రేమా ద్వేషమూ ఎలా ఉంటాయి? ఔదాసీన్యమంటే అదే.

భ: ఔదాసీన్యంవల్ల విధినిర్వహణలో ఆసక్తి తగ్గుతుంది. మా విధులు మేము సరిగా నిర్వహించాలా, వద్దా?

మ: చేయవలసిందే. నీ విధి నీవు చేయనెంచకున్నా, నీవు దానిని చేయవలసే వస్తుంది. దేన్ని చేయడానికై దేహం తాను వచ్చిందో దాన్ని అది పూర్తిచేయవలసిందే.

గీతలో శ్రీ కృష్ణులన్నారు - అర్జునుడు ఇష్టపడినా లేకున్నా, యుద్ధం చేయక తప్పదు. నీవు చేయవలసినపని మిగిలియుంటే దానికి దూరంగా ఉండలేవు; అలాగే చేయనక్కరలేనిదాన్ని చేస్తూనే ఉండలేవు. అంటే విధి విహితము చేయవల్సిందే. పని కొనసాగుతూనే ఉంటుంది. దానిలో నీ పాత్ర నీవు పోషించాలి. నీకు ఇవ్వబడిన పాత్ర.

భ: దానిని నిర్వహించడం ఎలా?

మ: నాటకంలోని నటుడు తన పాత్ర నిర్వహించేట్లు - రాగద్వేషాలు రెండూ లేకుండా.

సర్వం శ్రీ రమణార్పణమస్తు.